ఓం.

# ఓంకార ప్రభావము.

ఇది శ్రీ సద్గురు మలయాళస్వాముల వారి

చరణధూళియగు

సాధు గోవిందస్వామివారిచే విరచితము.

---

చిత్తూరు

[illegible] ప్రెస్సున ముద్రితము.

మొదటికూర్పు 1000 ప్రతులు.

1946

దీని వెల]

వలయువారు: శ్రీ వ్యాసాశ్రమము,
ఏర్పేడుపోస్టు, చిత్తూరుజిల్లా.
అని వ్రాసిన బడయగలరు.

శ్రీ రామతీర్థ గ్రంథావళి




బ్రహ్మతత్త్వ తత్త్వనిర్ణయం

ఓం.

# పీఠిక.

ఓం॥ సర్వే వేదా యత్పదమామనన్తి తపాంసి
సర్వాణి చ యద్వదన్తి యదిచ్ఛన్తో
బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం
సంగ్రహేణ బ్రవీమ్యో మిత్యేతత్॥

(కఠోపనిషత్).

తా॥ సమస్త వేదములెద్దానిని ఏకమైన ప్రాప్యమగు ఖ్యస్థానముగా చెప్పుచున్నవో సమస్త తపస్సులెద్దా పొందదగిన వస్తువునుగా బోధించుచున్నవో, ఏ మ్యాగోచరమగు విషయమును వాంఛించినవారలై పకుల వాసాది లక్షణయుతమైన బ్రహ్మచర్యము ష్ఠించుచున్నారో (ఆత్మారామునియందు రమించు న్నారో) అట్టి పరబ్రహ్మమును సంగ్రహముగా జెప్పు న్నాను. ఓమితి=ఓమని అట్టి పరబ్రహ్మము ఓంకార వాచ్యముగాయున్నది.

పరిశుద్ధాత్మ స్వరూపులగు జ్ఞానులారా! జ్ఞానాదేవహి కైవల్యం అనునటుల జ్ఞానమువలననే జీవుడు ముక్తుడగుచున్నాడు. అట్టి జ్ఞానమును మనమందఱ మవశ్యము సంపాదించవలయును. ఆ జ్ఞాన మేనన స్వస్వరూపమును గుర్తెఱుంగటయే, ఆకలిగొన్నవాడు అన్నముకొఱకు, దప్పిగొన్నవాడు జలముకొఱకును పరితపించునటుల ముముక్షువు సంసారబన్ధము నుండి విడువడి శాశ్వతసుఖమును బడయుటకై ఆతురత జెందినవాడు కావలయు. ఆముముక్షువే నిర్వికల్ప జ్ఞానమును బడయగల్గును. నిస్సంశయ జ్ఞానమును సంపాదించి సంసారసారమును తెరింపగోరువారలు (ఓంకారమే వేదం సర్వంధ్యేయం సర్వముముక్షుభిః) అను ఉపనిషద్వాక్యము రీతిగా సర్వవ్యాపకమగు ఓంకారమునే ఉపాసించ దొడంగవలయు సకల శాస్త్రములు, వేదములు, ఉపనిషత్తులు, ప్రణవోపాసనయే, ప్రధానమని నొక్కి వక్కాణించుచున్నవి.

ఏ మహానుభావులు, కలియుగ వైకుంఠమను శేషాచలక్షేత్రమున నెలకొన్న శ్రీ వెంకటేశ్వరులు ఏలాగున భక్తజనుల కాపాడుచున్నారో ఆలాగున కాశీబుగ్గ క్షేత్రమున శ్రీ వ్యాసాశ్రమమును స్థాపించి తన సమీ

పించియున్న ముముక్షులనే గాక దేశదేశాంతరములకు కరుణామూర్తులై చని సర్వ జనులను సద్బోధలచే నుద్ధరించుచున్నారను విషయము సుప్రసిద్ధమే, మఱియు, సంసారసాగరమున పడి తాపత్రయాగ్నిచే పరితపించు జనులను, జాతిమతభేదముల గణింపక స్త్రీలనియు, శూద్రులనియు నెంచక కేవల జిజ్ఞాసను మాత్రముగైకొని ప్రణవ నినాదమను మేఘనాదమును ధ్వనింపజేసి జ్ఞానవృష్టిని వర్షించి ముక్తులను జేయుచున్నారను విషయము కడుంగడు ప్రసిద్ధమే, అట్టి శ్రీ శ్రీ శ్రీ సద్గురుస్వాములవారు భాషాంతరములలోనున్న సారభూతములగు వేదాంత గ్రంథముల ఆంధ్రభాషలోనికి అనువదింపజేసి సమస్తాంధ్రము లోకమునకెంతో ఉపకారము గావించుచున్నారు ఇటుండ ఒకానొక పుణ్యదినమున అనేక జన్మకృత సుకృతరాశి ఫలించినదియో యనునటుల, అపార కరుణామూర్తియగు శ్రీ సద్గురుస్వాములవారు, మంత్రరాజమగు ప్రణవమునుగూర్చి అష్టోత్తర శతప్రమాణములచే ఒక చిన్న పొత్తమును వ్రాయుమని నన్నీ పవిత్రకార్యములో నియోగించి కృతార్థుని జేసిరి. ప్రణవ ప్రభావము గాధమను విషయము అందఱికి తెలిసిన విషయమే, అయినను,

శ్రీ సద్గురు కరుణాకటాక్షముచే నాబుద్ధికి స్ఫురించినంత శోధించి వ్రాయడమైనది. ఈ నూట ఎనిమిది ప్రమాణములు, దశోపనిషత్తులే గాక మఱికొన్ని ఉపనిషత్తులు, శాస్త్రములు పరిశీలించబడి వ్రాయబడియున్నవి. సాధారణముగా విషయములన్నియు శంకరభాష్యాను సారముగా విశదీకరింపబడియున్నవి. ఇద్దానిని చదివినచో ప్రణవ సారమును గ్రహించినవారనియే నావిశ్వాసము. ఓంకారము నుద్దేశించి సంగ్రహముగా తెలియజేయబడుచున్నది.

శ్లో॥ యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం,
చరంతి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే.

తా॥ వేదార్థము లెఱింగినవారిచేత నాశరహితమైనదని చెప్పబడుచున్నదియును, కామక్రోధాదులను జయించిన యతులచేత ప్రవేశింపబడుచున్నదియును, బ్రహ్మచర్య వ్రతము నవలంబించినవారిచే తెలియగోరబడుచున్నదియునైన మోక్షపదమును నీకు సంగ్రహముగా చెప్పెదను.

ఇట్లు ప్రణవమునే (ఓంకారమునే) ఉత్కృష్టమైన దానిని, గ్రహించుటకు, కారణమేమనగా ఓంకారము పరబ్రహ్మవాచకము. సర్వవ్యాపకము, నామరూప రహితము. సచ్చిదానంద స్వరూపమునగు నిర్గుణబ్రహ్మమును సులభముగ ఉపాసనచేయుటకు ఋషిపుంగవులచే సగుణాకారముగ గ్రహింపబడి, తత్ప్రతీకముగ సర్వశబ్దముల ఉత్పత్తికి మూలకారణభూతమైన ఓంకారమును, మహర్షులు ఏర్పాటుచేసిరి. గంగా, గోదావరి, సువర్ణముఖరీ మొదలైన నదులన్నియును, తమ కుత్పత్తి స్థానమగు సముద్రమును ప్రవేశించి, వాటి వాటి నామరూపముల నెట్లు విడుచుచున్నవో, అదే విధముగ సర్వశబ్దములును, సమస్తమైన తమ గ్రంథములును, ఓంకారమునందే లయములై పోవుటచేత ప్రపంచము లోగల మతసంఘము లన్నియు వాక్కుతో ప్రణవాను సంధానము చేయుచున్నవని ఋజువగుచున్నది. మరియు మహమ్మదీయు, క్రైస్తవ మతస్థులు వారివారి "ఖురాన్, బైబిల్" లను ప్రమాణముగ గ్రహించి, ఆయా మత గ్రంథములందు చెప్పబడిన మార్గముల ద్వారా, లేక మంత్రములద్వారా వాక్కుతో భగవంతుని ఉపాసనము చేయుచున్నామని

చెప్పుదురు. ప్రార్థనలు వాక్కుతో ఉచ్చరింపబడినప్పుడు ధ్వని (శబ్దము) కలుగుచున్నది. ఆశబ్దము మొదట (ఆది యందు) కంఠమునుండి ప్రారంభించునపుడు 'అ' అక్షర ముతో ప్రారంభమగును. కావుననే వ్యాకరణ నిర్మా తలు "అకుహ విసర్జనీయానాంకంఠః" అని వ్యాకరణ సూత్రమును ఏర్పాటుచేసిరి. శ్రీ భగవద్గీతలో, "అక్ష రాణాం అకారోఽస్మి" అక్షరములలో 'అ' కారము నేను అనుటలో శ్రీ కృష్ణభగవానుడు తన్ను అక్షరములకు మొట్ట మొదటిది యగు 'అ' కారముతో పోల్చు కొన్నాడు. మధ్య పెదవులు మూయు సందర్భమున 'ఉ' అను శబ్దము (స్వరము, సహజముగ గలుగుచున్నది. 'అ' స్వరముతో శబ్దాంత్యము, 'మ్' తో అనగా మకా రముతో పూర్తియగుచున్నది. అనగా నోరు 'మ్' అని మూయుటతో శబ్దము అంత్యమగుచున్నది. అనగా ఓమ్ శబ్దము అకారముతో ప్రారంభమై, ఉకారమును మధ్య గలిగి, మకారముతో అంత్యమగును. అ+ఉ+ మ్=ఓమ్. ఇదియే ఓంకారశబ్దరూపము. ప్రపంచము లోగల సర్వమతములవారును ఇట్టి ఓంకారశబ్దమునే ఉపాసించుచున్నారు. జైన, బౌద్ధమతములు గూడ తమ

తమ సిద్ధాంతములను ఏర్పరచుకొనునప్పుడు "అహింసా పరమోధర్మః" సత్యమేవజయతి నానృతమ్ "సత్యం వద; ధర్మంచర" అనెడి వేదభావములను గ్రహించియే యున్నారు. జైనులును, బౌద్ధులును, ఏ నిర్వాణసిద్ధిని పరమావధియని చెప్పిరో, దానినే అద్వైతులు ఆత్మ సాక్షాత్కారమనియు, ద్వైత విశిష్టాద్వైతులు విష్ణు సాయుజ్య ప్రాప్తియనియు, నుడివిరి. ఆస్తికమతస్థులు, రామ, కృష్ణ, శివ, నారాయణ, త్రిపురసుందరి ఇత్యాది నామములతో జపించినను, క్రైస్తవులు "ఓతండ్రీ, సర్వ లోకవాసీ, భగవంతుడా, మమ్ము రక్షింపుము" అని ప్రార్థనచేసినను, మహమ్మదీయులు "ఖుదాలాయి లాహా యిల్లిల్లా" అల్లా, ఇత్యాది ప్రార్థనలుచేసినను, సమస్త ప్రార్థనలకు అనగా శబ్దములకు ఓంకారమే మూలకారణ మైయుండున సర్వజనులును విశ్వేశ్వరుని అనగా సత్యజ్ఞానా నంద లక్షణములుగల యీ పరబ్రహ్మనే ఆయా మత సాంప్రదాయ వాక్యములతో ప్రార్థనచేసిన వారలగు చున్నారు. ఆర్యసమాజ బ్రాహ్మసమాజాది నూతన సంస్థలకు, న్యాయ మీమాంస, వైశేషిక, యోగ, సాంఖ్య, వేదాంతములను షణ్మతములకును, జైన, బౌద్ధ

మతములకును మూలమంత్రము ప్రణవమే, ఇట్టి ప్రణవ మును ధ్యానించి ముముక్షువులు సంసార సముద్రమును దాటి శాశ్వత సుఖమును బడయుదురుగాక ఈ గ్రంథ ము ప్రణవశక్తిని గురించి ఎక్కువగా ప్రతిపాదించి నందుచే ప్రణవ ప్రభావమని నామధేయము చేయబడెను. ఓంకారములోనే పుట్టి ఓంకారములోనే పెరిగి ఓంకార ములోనే లయించుచున్నట్టి సకల మతతత్త్వములున్ను అన్యోన్యరమ్యములై వర్తించుటకొఱకు ఉపదేశించు చున్నవను పరమార్థమును సకల మతాభిమానులును తెలిసికొని ఏకయోగక్షేమమై జీవించుటకు ప్రణవ స్వరూపి అనుగ్రహించుగాక.

ఓమ్. శాంతి, శాంతి, శాంతిః.

ఇట్లు శ్రీసద్గురు చరణధూళి,
సాధు గోవింద స్వామి.



★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

## ఓం తత్సద్బ్రహ్మణేనమః.

ఓంకార వాచ్యమాత్మానం - సచ్చిదానందలక్షణమ్ ।
సమస్త మంగళోపేతం - జగత్ప్రభు ముపాస్మహే ॥
ఓంకార స్సర్వవేదానాం - సారః తత్త్వప్రకాశకః ।
తేనచిత్త సమాధానం - ముముక్షూణాం ప్రకాశతే ।

తా॥ సమస్త వేదములయొక్క సారము ప్రణవమై యున్నది. అదియే బ్రహ్మ తత్త్వమును బోధించుచున్నది. ఆ ఓంకారాలంబనముచే, ముముక్షువు లందఱు శాశ్వతమగు మనశ్శాంతినిబొంది బ్రహ్మములో గలియుచున్నారు. కనుక అట్టి ఉత్తమమగు సారభూతమగు ప్రణవము, ముముక్షువుల యుపయోగము కొఱకై ప్రకాశింప జేయబడుచున్నది.

పవిత్రాత్మ స్వరూపులగు ముముక్షువులారా! యథార్థము దెలియజేయబడుచున్నది.

యంశైవాస్స ముపాసతే శివఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌద్ధా బుద్ధ ఇతిప్రమాణపటవః కర్తేతి నైయాయికాః ।

అర్హన్నిత్య థజైనశాశనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయంవోవిద ధాతువాంఛితఫలం త్రైలోక్యనాథో
హరిః ।

ఏ అఖండస్వరూపుని, విజ్ఞానఘనుని, శివోపాసకులు శివుడనియు, వేదాన్తులు బ్రహ్మమనియు, బౌద్ధులు విబుద్ధదేవుండనియు, తర్కశాస్త్ర నిపుణులు కర్తయనియు, జైనులు అర్హన్ననియు, మీమాంసకులు కర్మయనియు, ఉపాసించుచున్నారో! అట్టి సర్వస్వరూపాఽఽధారియగు అద్వితీయుండగు బరమాత్మ సమస్తదోషముల హరింప జేసినవాడై మీరు కోరినదాని నొసంగుగాక. "యేయథామాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహం" అను గీతావచనానుసారముగ పరమకారుణికుండగు భగవంతుఁడు భక్తులుగోరునటుల సాక్షాత్కరించుచున్నాడు. ప్రపంచములో సకల మతములును ఓంకారోపాసనలోనే లీనమగుచున్నవి.

ఓంకార శ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణఃపురా ।
కంఠంభిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ ॥ 1.

తా॥ ఓంకారశబ్దము, అథశబ్దమున్ను ఈ రెండు మొదట బ్రహ్మదేవుని కంఠమును ఛేదించుకొని బయటికి వచ్చినవి. అందువలన ఈ రెండు శబ్దములు మంగళ స్వరూపములు సమస్త విఘ్నములను నశింపజేయునవి. శుభమును గలుగజేయునవని చెప్పినందుచే యే యే మతస్థులు శివేత్యాది శబ్దములచే, యే యే స్వరూపమునుపాసించుచున్నారో, ఆశబ్దోపాసనలన్నియు ప్రణవోపాసనకన్న భిన్నములుకావు. కార్యకారణ రూపమైన యేప్రపంచము గలదో అది ఓంకారరూప మగుటవలన సర్వ స్వరూపము ఓంకారము. సకల పదార్థము లాకారము తన తన నామముకన్న యెటుల వేరుకాదో అటుల సమస్త నామవాచక శబ్దములన్నియు ఓంకారమునకన్న వేరుగాదు. ఓంకారము బ్రహ్మరూపముగ నున్నది. విచారదృష్టివలననో ? 'ఓం' అను అక్షరము బ్రహ్మమునందు అధ్యస్తము (కల్పితము) బ్రహ్మము దీని కధిష్ఠానము. అధ్యస్తముయొక్క స్వరూపము అధిష్ఠానముకన్న వేరుగాదు. కాబట్టి ఓంకారమును బ్రహ్మరూపమని యెఱింగి చింతించవలయును. ఓంకారము బ్రహ్మమునకు వాచకముగనున్నది. బ్రహ్మము వాచ్యము. అధ్యస్త-

నధిష్ఠానములకువలె వాచ్యవాచకముల కభేదమని యెఱుంగవలయును. కనుక వాచ్యమగు బ్రహ్మమునకన్న వాచకమగు ఓంకారము వేరుగాదు. కనుక బ్రహ్మమే ఓంకారము. ముముక్షువులు ప్రణవోపాసనచే శీఘ్రముగ గమ్యస్థానమును జేరగలరు.

2. "మంత్రాణాం ప్రణవశ్శిరః" అన్ని మంత్రములకు ప్రణవమే శిరస్సుగానున్నది ప్రణవమును మననము జేసినవాఁడు మునియగుచున్నాడు. ఈ ఓంకారము పరబ్రహ్మప్రాప్తికి అత్యంత సన్నిహితమగుటచే పరబ్రహ్మమునే బోధించుచున్నది. కనుక ఓంకారము పరబ్రహ్మమునకు ప్రతీకముగ అవయవముగ నున్నది. ఇందుకు ప్రమాణము "పాతంజలియోగ సూత్రము."

3. తస్య వాచకః ప్రణవః — ఆ పరబ్రహ్మమునకు ప్రణవము వాచకము ఓంకార నామోచ్చారణమే కాకుండ భావనగూడ యుండవలయును.

4. "తజ్జప స్తదర్థభావనమ్" కేవలము ప్రణవశబ్దమునే నుచ్చరించిన గుండులేని తుపాకివలె లక్ష్యమును బొందజాలదు. కనుక <u>జపముతోగూడ ప్రణవార్థమగు ఆత్మభావనయు ముఖ్యముగ నుండవలయును. భావనలేని</u>

జపము పరిపూర్ణ జ్ఞానము గలుగజేయజాలదు. కనుక "భావశుద్ధియే జ్ఞానసిద్ధి" యని మహాత్ములు జెప్పియున్నారు. "యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నట్లు భ్రమరకీటకము మాట్కియే పురుషుడు యెట్టి భావన జేయుచున్నాడో అట్టి స్వరూపమునే బొందుచున్నాడు. కనుక ఓంకారార్థమగు పరబ్రహ్మమునే భావించి తాను పరబ్రహ్మమే యగుచున్నాడు.

5. ప్రణవోహిపరబ్రహ్మ ప్రణవః పరమం పదమ్ ।
ప్రణవంసర్వవేదాద్యం సర్వదేవమయంవిదుః ॥

తా॥ ఓంకారమే పరబ్రహ్మము. అదియే ఉత్కృష్ట స్థానము. "ఉద్గాతః ప్రణవోయాసాం" అని కాళిదాసోక్తి చొప్పున సమస్తవేదములకు మూలము ప్రణవమే బాగుగ విచారించిన సమస్తశాస్త్రములు, సమస్తవేదములు, సకలోపనిషత్తులు పరబ్రహ్మ ప్రాప్తిసాధనముగా ఓంకారమునే ప్రతిపాదించుచున్నవి.

సూతసంహిత.

6. మృద్వాసనే సమాసీనో యతచిత్తేంద్రియక్రియః
ఓమిత్యుచ్చారయేత్తావత్ మనోయావత్ప్రసీదతి ॥

తా॥ మృదువగు కంబళ్యాది ఆసనములమీాద క్రమముగ గూర్చిండి, సమస్త ఇంద్రియవికారముల నణచి మనస్సు నిర్మలమగువఱకు, (మనస్సు ఆత్మలో ఐక్యమగు పర్యంతము) ప్రణవమును జపించవలయును.

7. ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యతి ।

ఓంకారమనెడి తెప్పచేతనే; సంసార సముద్రమును తరింపగలుచున్నాడు.

## ముండకోపనిషత్తు

8. ధనుర్గృహీ త్వౌపనిషదం మహాస్త్రం,
శరంహ్యుపాసా నిశితం సంధయీత ।
ఆయమ్యత ద్భావగ తేనచేతసా,
లక్ష్యం తదేవాక్షరం సోమ్యవిద్ధి ॥

తా॥ ఆత్మతోటి ఓంకారాను సంధానము చెప్పబడుచున్నది. ఉపనిషత్తులందు ప్రతిపాదింపబడిన, మహాస్త్రమగు ప్రణవమనెడి ధనుస్సును గ్రహించి ఉపాసనచేత (సంతతధ్యానముచేత) తీక్ష్ణముగ చేయబడిన, బాణము

ననుసంధానము చేయవలయును. ఆశరమును బాగుగలాగి, (ఇంద్రియములతో కూడిన అంతఃకరణమును, విషయాదుల నుండి మరలించి) లక్ష్యమందే (బ్రహ్మమందే) యుంచి బ్రహ్మభావనారూపమగు, మనస్సుచే, లక్ష్యమగు బ్రహ్మమునే భేదించవలయును. ఈ విషయమే నిక సవిస్తారముగ చెప్పబడుచున్నది.

9. ప్రణవో ధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥

తా॥ ఏలాగున ధనుస్సు శరానుసంధానమునకు గారణమగుచున్నదో, ఆలాగున బ్రహ్మమునందు ఆత్మానుసంధానమునకు, ప్రణవము గారణమగుచున్నది. బాగుగ యెక్కుపెట్టబడిన ధనుస్సుచేత, బాణము ఎటుల లక్ష్యమును జేరునో! అటులనే అభ్యసింపబడిన ప్రణవముచేత, ఆత్మ సంస్కరింపబడినదై అక్షరపరబ్రహ్మమునందు చేరుచున్నది. అనగా ప్రణవము ధనుస్సు, బాణము, ఆత్మ, లక్ష్యము బ్రహ్మమైయున్నది. కనుక అప్రమత్తుడై, విరక్తుడైన, జితేంద్రియుడగు ముముక్షువు ప్రమాదరహితమగు (ఏకాగ్రమగు మనస్సుచేత) లక్ష్యభూతమగు బ్రహ్మ

మును భేదించవలయును. అనగా బ్రహ్మముచేరవలయు ననుట. బాణము లక్ష్యమును భేదించిన తరువాత, లక్ష్యముతోడి ఏకమగు నటుల ఆత్మ బ్రహ్మముతో కలసిన తరువాత తాను బ్రహ్మరూపుడే యగుచున్నాడు.

10. యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం
మనః సహ ప్రాణైశ్చ సర్వైః ।
తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో
విముంచథా మృతస్యైష సేతుః ॥

తా॥ ఏ పరబ్రహ్మమునందు, స్వర్గలోకము, పృథివి, అంతరిక్షము, సమస్తప్రాణములతో కూడుకొన్నటువంటి మనస్సున్ను ఇవి కూడికొని యున్నవో, అట్టి పరబ్రహ్మమును, అన్నిటికి ఆశ్రయముగాను, అద్వితీయముగాను దెలిసికొనుడు. ఇతరమైన శబ్దజాలమును విడువుడు. ఈ ప్రణవమే అమృత స్వరూపమగు మోక్షప్రాప్తికి సేతువుగ నున్నది.

11. తమేవ విదిత్వా ఽతిమృత్యుమేతి,
నాన్యః పంథావిద్యతే ఽయనాయ.

అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

ఓంకారమే పరబ్రహ్మప్రాప్తికి మూలముగ నున్నది. ఇంతకన్న వేరుమార్గము లేదని వక్కాణించుచున్నది.

12. అరాఇవరథనాభౌ సంహతా యత్రనాడ్యః ।
సఏషోఽన్తశ్చరతి బహుధాజాయమానః ॥
ఓమిత్యేవంధ్యాయథ ఆత్మానం ।
స్వస్తినః పారాయత మసః పరస్తాత్ ॥

తా॥ రథచక్రకుండమునందు అరములు (ఆకులు అమర్చబడినట్లు, ఏహృదయమునందు సమస్తనాడులు ప్రవేశించినవై అమర్చబడి దేహమునంతయు వ్యాపించి యున్నవో, అట్టి హృదయకమలమునందు, సాక్షీభూతుడగు అంతరాత్మ చూచుచు, వినుచు, తలంచుచు, తెలిసికొనుచున్నవాడై, అనేకవిధములగు కోపము, సంతోషము మొదలుగాగల, అంతఃకరణ ధర్మములచే, పుట్టుచున్నవాడు వలెనున్నవాడై సంచరించుచున్నాడు. ఆ ఆత్మను ఓంకారమే ఆలంబనముగలవారలై, ధ్యానింపుడు. అట్టి ప్రణవోపాసకులగు మీకు తమస్సునకంటె పరమమైన బ్రహ్మప్రాప్తికొఱకు స్వస్తి శుభముగుగ (నిర్విఘ్నముగుగాక.)

# ఛాందోగ్యోపనిషత్

## ఉద్గీథోపాసన (ప్రణవోపాసన)

13. ఓమిత్యే తదక్షరం ఉద్గీథముపాసీత ।
ఓమితిహ్యుద్గాయతి తస్యోప వ్యాఖ్యానమ్ ॥

ఓం అనే అక్షరము పరమాత్మకు ప్రియమగు నామధేయముగానున్నది. ఎందుకనగా ఓంకారోచ్చారణము చేతనే పరమాత్మ ప్రసన్నుడగుచున్నాడు. భగవంతుని విగ్రహాదులు యెటుల భగవంతునికి ప్రతీకములై (జ్ఞాపకములై) యున్నవో, అటులనే ప్రణవము పరమాత్మకు ప్రతీకముగనున్నది. ఈ ప్రకారము పరమాత్మకు నామధేయముగాను, ప్రతీకముగానుయున్నందుచేత ఓంకారము పరమాత్మోపాసనకు ముఖ్యసాధనమని సర్వవేదాన్తసిద్ధాన్తము. కనుక ఓమిత్యేతదక్షరం" ఓం అనే యీ అక్షరాత్మకమగు ఉద్గీథశబ్దవాచ్యమగు ప్రణవము నుపాసించుడు. (పరమాత్మవాచకమగు ప్రణవమునందు స్థిరమైన బుద్ధిని నిలుపుడు). ఓంకారమునకు ఉద్గీథమని పేరు యెటుల వచ్చినదని శ్రుతియే చెప్పుచున్నది. "ఓమి

తివ్యుద్గాయతి తస్యోపవ్యాఖ్యానమ్" సామవేదము నకు సంబంధించిన స్తోత్ర విశేషమునకు ఉద్గీథ భక్తియని పేరు గలదు. ఆ స్తోత్రములో ఓమ్ అని ఆరంభించి ఎందువలన ఉద్గాత (గానముచేయువాడు) ఉచ్చైర్గానము చేయుచున్నాడో అందువలన ఓంకారమునకు ఉద్గీథమని వ్యాఖ్యానము చేయబడినది. ఉద్గీథమనగ ఓంకారమని యర్థము.

14. ఏషాం భూతానాం పృథివీరసః, పృథివ్యాఆపోరసః।
అపా మోషధయోరసః, ఓషధీనాంపురుషోరసః ॥
పురుషస్యవాగ్రసో, వాచఋుగ్రసరుచస్సామరసః।
సామ్న ఉద్గీథోరసః ॥ అ 1, ఖం 1. మం 2.

తా॥ సమస్త చరాచరాత్మకములగు భూతములకు భూమి రసః=ఆధారము. ఓషధులకు పురుషుడాధారము. పురుషునకు వాక్కు శ్రేష్ఠము. అట్టి వాక్కునకు ఋక్ మంత్రము శ్రేష్ఠము. ఋక్కుకన్న సామశ్రేష్ఠము. అట్టి సామమునకుకూడ ఉద్గీథము (ప్రణవము) శ్రేష్ఠము.

15. సఏషరసానాం రసతమః పరమః
పరార్థ్యోఽష్టమోయదుద్గీథః । 1-1-3.

తా॥ ఈ ఉద్గీథమనెడి ఓంకారము రసానాం=ముందు జెప్పబడిన భూతములలో మిక్కిలి సారతమమైనది. పరమః—పరమాత్మకు ప్రతీకమైనది. పరార్థ్యః=పరమాత్మవలె యుపాసింపదగినది. ఎందుకనగ, పృథివ్యాదులలో ఉద్గీథమనునది ఎనిమిదవదో? అందువలన అన్నిటికంటెను శ్రేష్ఠమైనది.

16. ఆపయితాహ్వై కామానాం భవతి
యఏతదేవం విద్వానక్షరముద్గీథముపాస్తే॥ 1-1-7

తా॥ ఏవిద్వాంసుఁడు అక్షరమగు ఉద్గీథోపాసనచేయుచున్నాఁడో, అట్టివాడు సమస్తకోరికలను బొందుచున్నాడు. ఈ ప్రణవమే సమస్తము నొసంగుచున్నది. ఇందులకు ప్రమాణము శ్రుతి "తంయథాయథోపాసతే తదేవ భవతి".

17. తద్వా ఏతదనుజ్ఞాక్షరం యద్ధి
కించాను జానాత్యో మిత్యేవతదాహ
ఏషావ సమృద్ధిర్యదనుజ్ఞా।
సమర్థ యితాహ్వై కామానాం భవతి
యఏతదేవం విద్వానక్షరముద్గీథముపాస్తే॥
1–1–8.

తా॥ ఈ ప్రణవాక్షర మంగీకార వాచకముగ నున్నది. అదేటులన, లోకములో, జ్ఞానిగాని, ధనికుఁడుగాని, జ్ఞానముకొఱకైనా ధనముకొఱకైనా అనుమతి నిచ్చునపుడు ఓం యనుచున్నాడు. మఱియు యీ ఓంకారము సమృద్ధిరూపముగానున్నది. అనగ యీ ఓంకారము సర్వసమృద్ధిని కలుగ జేయుచున్నది. ఉపాసకునికి సమస్తకోరికల నిచ్చుచున్నది. కనుక ఇట్టి ఓంకారమును విద్వాంసు డుపాసించుచున్నాడు.

ఓంకారస్తుతి.

18. తేనేయం త్రయీవిద్యా వర్తత
ఓమిత్యాశ్రావయత్యోమితి।
శంసత్యోమిత్యుద్గాయత్యేతస్యై
వాక్షరస్యాపచిత్యైమహిమ్నా రసేన॥ 1-1-9.

తా॥ ఈ ఓంకారముచేతనే మూఁడు వేదములు ప్రవర్తించుచున్నవి. తద్విహిత కర్మలును ప్రవర్తించుచున్నవి. అధ్వర్యుఁడు ఓం అని వినిపింపచేయుచున్నాడు. ఓం అని చెప్పుచున్నాడు. ఓం అని ఉచ్చైర్గానము చేయుచున్నాడు. కనుక సమస్తయాగకర్మలును యీ ఓంకారము

యొక్క స్తుతిగాఁ ఉంటున్నవి. ఇందుకు ప్రమాణము గీత "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతిమానవః" ఈ అక్షరముయొక్క మహిమచేత (ఋత్విక్ యజమానాది ప్రాణముచేత) యీ అక్షరముయొక్క రసముచేత (వ్రీహి యవాది రూపహోమద్రవ్యముచేత) యాగహోమాదులు ఓంకారోచ్చారణ పూర్వకముగాచేయ బడుచున్నవి. తమ కర్మచే ఆ ఓంకారమును పూజించి మానవుడు సిద్ధిని బొందుచున్నాడు.

19. తేనోభౌకురుతో యశ్చైతదేవం
వేదయశ్చనవేద, నానాతు విద్యాచా
విద్యాచయదేవ విద్యయా కరోతి
శ్రద్ధయోపనిషదా, తదేవ వీర్యవత్తరం భవతీతి
ఖల్వేతస్యైవాక్షరస్యోప వ్యాఖ్యానం భవతి॥
1-1-10.

తా॥ ప్రణవలక్ష్యమగు పరబ్రహ్మమును తెలిసికొని ఉపాసించు విజ్ఞానియు, ప్రణవ యథార్థ స్వరూపము నెఱుంగక నుపాసించువాడును, వీరిద్దరు ఓంకారము నుపాసించుచున్నారు. అయినను వీరికి ఫలభేదములు

గలవు. ఎట్లనగ విద్యావిద్యలు భిన్న స్వరూపములు భిన్న ఫలములు గలవి. విద్యతోఁగూడు కొన్నవాఁడు విద్వాంసుఁడు. అవిద్యతోఁకూడు కొన్న వాఁడవిద్వాంసుఁడు. ఏ విద్వాంసుఁడు ప్రణవస్వరూపమును చక్కఁగ నెఱింగి యుపనిషత్తులలో ప్రతిపాదింపబడిన రీతిగా (ఆత్మాను సంధాన రూపయోగముచే) ధ్యానించుచున్నాడో, అట్టివాడు సారవంతమైన ఫలమును, (శాశ్వత సుఖమును) బొందుచున్నాడు. తదితరుడు=అవిద్వాంసుడు సారభూతమగు కర్మాను గుణఫలమును బొందుచున్నాడు. ఇదియే యీ అక్షరముయొక్క వ్యాఖ్యానమగుచున్నది.

20. దేవాసురాహ వై యత్ర సంయేతి రఉభయే
ప్రాజాపత్యా స్తద్ధ దేవా
ఉద్గీథమాజహ్రురనేనైనానభి భవిష్యామ ఇతి ॥
1-2-1.

తా॥ పూర్వము ప్రజాపతి కుమారులగు దేవతలు, అసురులు వీరిద్దఱు యుద్ధమును జేసిరి. దేవతలు మేము ఉత్కృష్టులముగా వలయునని ఉద్గీథము నుపాసించిరి. మేము యుపాసనచేతనే రాక్షసులను దిరస్కరించగలమని నిశ్చయించికొనిరి.

21. తంహాంగిరా ఉద్గీథముపాసాం చక్ర,
ఏతము ఏవాంగిరసం మన్యంతే ఽంగానాం
యద్రసః ॥ 1-2-10.

తా॥ ఆంగిరసుడనే మహర్షి ముఖ్యప్రాణమను ఆత్మ స్వరూపమైన ఓంకారము నుపాసన జేసెను. అందుచే యాఓంకారమునకు ఆంగిరసమని పేరువచ్చెను. మఱియు ఓంకారము అంగములకు ప్రాణమగుట వలన ఆంగిరస మనిజెప్పంబడియె.

22. తేనతంహా బృహస్పతి రుద్గీథ ముపాసాం చక్ర।
ఏతము ఏవ బృహస్పతిం మన్యంతేవాగ్ఘి
బృహతీ తస్యా ఏష పతిః ॥

తా॥ ముఖ్యప్రాణమగు ప్రణవమును బృహస్పతి యుపాసించెను. అందుచే ప్రణవమునకు బృహస్పతి యని పేరు పొడమెను. బృహస్పతి యనగ వాక్కు, అట్టివాక్కు నకు పతిగా యున్నందున యీ ప్రణవము బృహస్పతి యయినది.

23. తేనతంహాయాస్య ఉద్గీథ ముపాసాం చక్ర
ఏతము ఏవాయాస్యం మన్యంత ఆస్యాద్య దయతే॥

తా॥ ఆయాస్యుండనే మహర్షి యీయుద్గీథోపాసనఁ జేసెను. అందువలన యీ ఓంకారము ఆయాస్యమని పేర్కొనబడియె. ఎందువలన యీప్రణవశబ్దము ముఖము నుండి బయట వెడలుచున్నదో, అందువలన ఆయాస్య మని చెప్పబడియె.

24. తేనతంహబకోదాల్భ్యో విదాంచకార
సహనైమిశీయానా ముద్గాతా బభూవ
సహస్మైభ్యః కామానాగాయతి ॥

తా॥ ఇటులదల్భ కుమారుడగు బకుఁడు యీ ప్రణవమును బాగుగ దెలిసికొని యాప్రాణ విజ్ఞానసామర్థ్యము వలన, నైమిశారణ్యములోని యజ్ఞముల కన్నిటికి ఉద్గాతగా ఆయెను. ఆతడే యాజ్ఞకులకొఱకు సమస్త కోరికలను గానము జేసెను.

25. ఆగాతాహవై కామానాం భవతి
యఏతదేవం విద్వానక్షరముద్గీథముపాస్తే
ఇత్యధ్యాత్మమ్ ॥

తా॥ ఏవిద్వాంసుడు యీ అక్షరమగు ప్రణవమును చింతించుచున్నాడో, అట్టివాడు సమస్తకోరికలను బొందుచున్నవాడగు చున్నాడు. ఇటుల ఆత్మ విషయకమగు ఉద్గీథోపాసన జెప్పబడినది.

26. అథాధి దైవతం య ఏవాసౌతపతి
తముద్గీథముపాసీతోద్యన్వా ఏషప్రజాభ్య
ఉద్గాయతి ఉద్యమం స్తమోభయమ పహంత్య
పహంతాహవై భయస్యతమసోభవతి
య ఏవం వేద ॥

తా॥ ఇచ్చట ఆదిత్యోపాసన జెప్పబడుచున్నది. ఏసూర్యుడు ప్రకాశించుచున్నాడో అట్టి ఆదిత్యుని ప్రణవ స్వరూపునిగా యుపాసించవలయును. ఆ సూర్యుడు ఉదయించుచు ప్రజల కొఱకు అన్నాదుల నిచ్చుచున్నాడు. సూర్యుడు ఉదయించక బోయినచో, ధాన్యాదులు ఫలించవు, గదా? మరియు చీకటి భయమును బోగొట్టుచున్నాడు. ఈ ప్రకారముగా యుపాసించుచున్న వారలకు జనన మరణాది రూప అజ్ఞాననాశము గలుగుచున్నది. ఇచ్చట ఆదిత్యుడనగ పరబ్రహ్మమనియు గ్రహించవచ్చును.

27. యదావాఋుచ మాహోన్నతో్యమిత్యే
వాతిస్వర త్యేవంసామైవం యజుర్యేష
ఉన్వరోయదేత దక్షరమేత దమృత
మభయం తత్ప్రవిశ్య దేవా అమృతా అభయా
అభవన్ ॥

తా॥ ఋఙ్మంత్రముల నుచ్చరించునపుడు ఓం అని మిక్కిలి యాదరముతో ఉచ్చరించుచున్నారు. ఇటులనే సామవేదమును, యజుర్వేదమును, ఉపక్రమించునపుడు, ఉకార రూపమగు ప్రణవమునే ఉచ్చరించుచున్నారు. ఈ విధముగ ఉచ్చరింపబడినందున స్వరమనియు దీనికి నామధేయము సిద్ధించినది. అమృతస్వరూపమును, అభయ స్వరూపమును, అక్షరమును, అగు యీ ఓంకారము నుపాసించినవారు అమృతత్వమును (శాశ్వతసుఖమును) అభయత్వమును (అద్వితీయత్వమును) బొందుచున్నారు. దేవతలు ఈ ప్రణవము నుపాసించియే, అమృతులనియు, అభయులనియు, చెప్పంబడిరి.

28. అథఖలు య ఉద్గీథః సప్రణవో యః ప్రణవః
సఉద్గీథ ఇత్యసౌవా ఆదిత్య ఉద్గీథ ఏషప్రణవ
ఓమితిహ్యేషస్వరన్నేతి ॥

తా॥ ఏది ఉద్గీథమని జెప్పబడుచున్నదో, అదే ప్రణవ మని జెప్పబడుచున్నది. ఎయ్యది ప్రణవమని పేర్కొన బడెనో, అదియే ఉద్గీథమని ప్రసిద్ధికెక్కెను. ఇకను సూర్యుడుగూడ ఉద్గీథమని చెప్పబడుచున్నాడు. ఆదిత్యున కెటుల ఉద్గీథమని పేరువచ్చినదనగా సూర్యుడు ఉద్గీథ మను ప్రణవమునే "స్వరన్" ఉచ్చరించుచు ఉదయించు చున్నాడు.

29. అథాధ్యాత్మం య ఏవాయం ముఖ్యః ప్రాణ
స్తముద్గీథముపాసీతో మితి హ్యేష స్వరన్నేతి ॥

తా॥ అధ్యాత్మదృష్టితో ఓంకారోపాసన జెప్పబడు చున్నది. ఏదైతే ముఖ్యప్రాణముగ నున్నదో (ఆత్మగా ఉన్నదో) అట్టి ఆత్మస్వరూపమగు ప్రణవమును ఓం అని ఉపాసించవలయును. ఈ ముఖ్యప్రాణమే ఓం అని అంగీకార వచనమును సూచించుచున్నదివలె వాగాది ఇంద్రియములయొక్క ప్రవృత్తికొఱకు ప్రవర్తించుచున్నది.

30. త్రయోహోద్గీథే కుశలా బభూవుః
శిలకః శాలావత్యశ్చై కితాయ

నోదాల్భ్యః ప్రవాహణోజైవలిరితి
తేహోచురుద్గీథేవై కుశలాః స్మోహంతోద్గీథే
కథాంవదామ ఇతి॥ 1-8-1.

తా॥ ఈఉద్గీథోపాసనలో యెవరెవరు నిపుణులైరను విషయము తెలియజేయ బడుచున్నది. శలావంతుని కుమారుడగు శిలకమహర్షియు, చికితాయన కుమారుండగు చేకితానుండును, దల్భగోత్రములో బుట్టిన జీవల పుత్రుడగు ప్రవాహణుడున్ను, వీరు ముగ్గురు మేము ప్రణవోపాసనలో నిపుణులము కనుక ఉద్గీథోపాసనను గురించి కథను జెప్పెదమనిరి.

31. ప్రజాపతిర్లోకా నభ్యతపత్తేభ్యోఽభితప్తే
భ్య స్త్రయీ విద్యాసంప్రాస్రవత్తా మభ్యత
పత్తస్యా అభితప్తాయా ఏతాన్యక్షరాణి
సంప్రా స్రవంత భూర్భువః స్వరితి ॥ 2-23-2.

32. తాన్యభ్య తపత్తేభ్యోఽభితప్తేభ్య ఓంకారః
సంప్రాస్రవత్తద్యథాశంకునా సర్వాణి పర్ణాని

సంతృణ్ణాన్యేవ మోంకారేణ సర్వావాక్సం
తృణ్ణోంకార ఏవేదం సర్వమోంకార ఏవేదం
సర్వమ్ ॥ 2-23-3.

తా॥ బ్రహ్మదేవుడు అనగా విరాట్ పురుషుడు లోకముల నుద్దేశించి లోకములలో సారమును గురుతెలియంగ వలయునని కోరికతో తపస్సును జేసెను, చింతింపబడిన లోకములకంటె సారభూతములైనవి, మూడు వేదములు (ఋగ్ యజుః సామః) అని బ్రహ్మదేవునియొక్క మనస్సులో గోచరమాయెను. తిరుగ ఆ మూడు వేదములు బాగుగ ఆలోచింపబడెను. వాటిలో "భూర్భువస్స్వః" అని వ్యాహృతి రూపమైన మూడక్షరములు సారభూతములైనవని బ్రహ్మదేవునిచే నిశ్చయింపబడెను. మఱియు ఆ అక్షరములున్ను బాగుగ ధ్యానింపబడినవి. వాటికన్నను ప్రణవమే సారభూతమైనదని ప్రజాపతికి చిత్తమున ధారణ గలిగెను. ఆ ఓంకారబ్రహ్మమెట్టిదనగ శంకువుచే అనగా కాడచే (పెద్ద ఈనచే) ఆకులన్నియు ఎటుల వ్యాప్తములైయున్నవో అటులనే ప్రణవ బ్రహ్మముచే (పరమాత్మ ప్రతీకముచే) సమస్తశబ్ద జాలములున్ను,

వ్యాపింపబడియున్నవి. ఇందులకు ప్రమాణము శ్రుతి "అకారోవై సర్వావాక్ ఓంకార ఏ వేదం సర్వం ఓంకార ఏ వేదం సర్వం" ఈ సమస్తమంతయు ఓంకార బ్రహ్మమే. ఈ సమస్త మంతయు ఓంకారబ్రహ్మమే.

అథబృహదారణ్యకోపనిషత్.

౦ 33. ఓంఖంబ్రహ్మ ఖంపురాణం వాయురం
ఖమితిహాస్మాహకౌర వ్యాయణీపు
త్రో వేదోఽయం బ్రాహ్మణా వి
దుర్వేదైనేనయద్వేది తవ్యమ్ ॥ 5-1-1.

తా॥ "ఓంఖంబ్రహ్మ" అనునది మాత్రము మంత్రమని నెఱుంగవలయును. తదితరమగునది వ్యాఖ్యానరూపమగు బ్రాహ్మణము. ఈ బ్రాహ్మణము ధ్యాన కర్మయందే యీ మంత్రముయొక్క వినియోగమును జెప్పుచున్నది. "ఓం ఖం బ్రహ్మ" బ్రహ్మయనునది విశేష్యపదము. ఖం అనునది విశేషణము. విశేష్య విశేషణములకు అభేదమని యెఱుంగవలయును. ఖం అనగా ఆకాశము బ్రహ్మ

మనగ బ్రహ్మము ఈ రెండింటికి అభేదము చెప్పుటచేత ఆకాశము బ్రహ్మమని అర్థము సిద్ధించుచున్నది. మఱియు ఖం బ్రహ్మ (ఆకాశ బ్రహ్మ) పరమాత్మాకాశమనియు చెప్పవచ్చును. ఈ పరమాత్మాకాశము ఓంకారశబ్ద వాచ్యార్థముగాను ఓంకారశబ్ద స్వరూపముగాను ఉన్నది. ఇచ్చట ఓంకారశబ్దము బ్రహ్మోపాసన సాధనము కొఱకు ప్రయోగింపబడినది. ఖం బ్రహ్మ=ఆకాశబ్రహ్మము (పరమాత్మాకాశము) ఓం=ఓంకారశబ్దవాచ్యము. ఈ ప్రణవమే పరబ్రహ్మోపాసనకు ముఖ్యసాధనమని దృఢపరచుటకై ప్రమాణముగా శ్రుతి వాక్యములు చూపింపబడుచున్నవి. "ఏతదాలంబనం శ్రేష్ఠమే తదాలంబనం పరం" అని కఠోపనిషత్. "ఓమిత్యాత్మానం యుఞ్జీత" అని మహానారాయణోపనిషత్. "ఓమిత్యేతేనై వాక్షరేణ పరంపురుష మభిధ్యాయీత" అని ప్రశ్నోపనిషత్. "ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం" అని ముండకోపనిషత్. "ఓమితిశంసతి ఓమిత్యుద్గాయతి" ఇవి మొదలుగాగల చోట్లయందు వేదములయొక్క ప్రారంభములోను, అంతములోను, ఓంకారము ప్రయోగించుటవలన, ఓంకారమే, ధ్యానమునకు, ముఖ్యసాధనమను, అభిప్రాయ

ముతో, ఓంకారశబ్దోపదేశము చేయబడినదని తెలియు చున్నది. మఱియు బ్రహ్మవాచకములైన అనగా బ్రహ్మ మును బోధించునట్టి బ్రహ్మ, ఆత్మ, సత్యార్థ జ్ఞానమిత్యాది పదముల నేకములుగలవు. పై జెప్పిన శ్రుతుల ప్రమాణ ములచే, ప్రణవమే సమీపవర్తియగు, ప్రియతమమగు, బ్రహ్మమున కభిధానం (నామమని) ప్రతిపాదింపబడు చున్నది. కనుకనే బ్రహ్మజ్ఞానముకొఱకు యీ ఓంకా రమే పరమసాధనము. ఈ ఓంకార మిరుతెఱంగులై (ప్రతీకమై, అభిధానమై) వెలయుచున్నది. బ్రహ్మము నకు ప్రతీకమని, అభిధానమనియు, ఇరుతెఱంగులై వెల యు చున్నది. విగ్రహములు విష్ణ్వాది దేవతలయొక్క ప్రతీకములై (జ్ఞాపక చిహ్నములై) యెట్లులనున్నవో అట్లనే బ్రహ్మమునకు ప్రతీకముగ ప్రణవమున్నది. ఓంకారముచేతనే బ్రహ్మము తెలిసికొనదగినదిగా నున్నది. ఓంకారము నవలంబించినవానికి, పరబ్రహ్మము అను గ్రహించుచున్నది. ఇందులకు ప్రమాణము "ఏతదాలం బనం శ్రేష్ఠమే తదాలంబనం పరం, ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే" కఠోపనిషత్ ఖం అను చోట ఆకాశ భూతమునందు జ్ఞానముకలుగకుండుట

కొఱకై వివరింపబడుచున్నది. ఖం పురాణం=సనాతన మగు ఆకాశము పరమాత్మాకాశము. పరబ్రహ్మమని అర్థము. ఏ పరమాత్మాకాశము "పురాణం ఖం" సనాతనమైన ఆకాశమని జెప్పబడినదో, అట్టి బ్రహ్మము చక్షురాది యింద్రియముల కగోచరమైనందుచేతను, నిరాలంబన వస్తువును గ్రహించుటకు శక్తి లేక పోవుటచేతను శ్రద్ధా భక్తి పూర్వక భావనారూపముచేత నాలంబనమగు ప్రణవమందే పరమాత్మ ప్రవేశించుచున్నాడు. భక్తులు విష్ణ్వాది శిలాప్రతిమలందు, విష్ణ్వాది దేవతలను భావనము జేయునటుల పరబ్రహ్మోపాసకులు ప్రణవమునందు పరబ్రహ్మమునే భావించవలయును. "వా యు ర ం ఖ ం", వాయురం=వాయువుతో కూడుకొన్నది. ఖం=ఆకాశము, ఆకాశమేను. పరమాత్మాకాశముగాదు. ఖ శబ్దము వాయువుతో కూడుకొన్న ఆకాశమునందే ముఖ్యముగ వ్యవహరింపబడుచున్నది. ఇటుల కౌరవ్యాయణీ పుత్రుడు చెప్పెను. ఫలించిన అర్థమేమనగా? "పురాణం ఖం"= నిరుపాధిక బ్రహ్మము. వాయురంఖం=సోపాధిక బ్రహ్మము. (సగుణబ్రహ్మము)న్ను ఓంకారస్వరూపములే. ప్రతిమాదులు విష్ణ్వాదులయొక్క ప్రతీకముల మాటికి, ఓం

కారము పరబ్రహ్మ ప్రాప్తిసాధనముగ నున్నది. ఇందులకు ప్రమాణము — ప్రశ్నోపనిషత్ "ఏతద్వై సత్యకామ పరంచా పరంచ బ్రహ్మయదోంకారః" ఈ ఓంకారము వేదమనియు చెప్పబడుచున్నది. ఈ ఓంకారముచేత "యద్వేదితవ్యం" యేద్దైతే దెలియదగినదో దానిని తెలిసికొనుచున్నాడు. అందువలన వేదమను ఓంకారము పరమాత్మకు వాచకముగ నున్నది. ఇట్టి అభిధానమగు ఓంకారముచేత అభిధయమానమగు (చెప్పబడు) ప్రకాశ్యమానమగు (ప్రకాశింపజేయబడు) తెలిసికోదగిన యే బ్రహ్మమును సాధకుడు పొందుచున్నాడో, అందువలన యీ ఓంకారము వేదమని బ్రాహ్మణాః=బ్రహ్మజ్ఞానులు తెలిసికొనిరి. బ్రహ్మజ్ఞానులకు యీ ప్రణవము, అభిధానరూపసాధనముగా ఇష్టమైయున్నది. ఒకవేళ యీ ఓంకారము వేదమనుట అర్థవాదవాక్యముగ (స్తుతివాక్యముగ) యుండవచ్చును. సమస్త వేదములుకూడ ఓంకారమేను. శాఖాదులచే భిన్నములైన, ఋగ్, యజుర్, సామాధర్వణమంత్రములుకూడ ఓంకారస్వరూపములై ప్రణవభావముచే గూడికొనియున్నవి. అదెటులన, ఛాందోగ్యోపనిషత్ "తద్యథాశంకునా సర్వాణి పర్ణాని"

ఇంతకు ఫలించిన దేమనగ, ఓంకారము వేదము. ఏది తెలియదగినదై యున్నదో అద్దానిని "అనేన ఓంకారేణ"=యీ ఓంకారముచేతనే తెలియుచున్నాడు. అందువలనిది వేదమని చెప్పబడిెను. ఇటులనే జ్ఞానసాధనములగుటచే వేదముల కన్నిటికి వేదత్వము సిద్ధించినది. అయినను ఆ వేదములకన్న ఓంకారమే శ్రేష్ఠమయినందుచే ముఖ్యసాధనమని యెఱుంగవలయును. ఇటుల యెవరెఱిగిన వారనగా ? బ్రహ్మజ్ఞానులే బ్రహ్మజ్ఞానులచే యిది ప్రణవ ఉద్గీథాది నామధేయములచే చెప్పఁబడెను. ఈ ప్రణవోపాసన మాత్రముచేసినచో, సమస్తవేదోపాసనలుచేసినటులేను. ఈ ప్రకారముగ బృహదారణ్యకోపనిషత్తు ఉద్ఘోషించుచున్నది.

## అథమాండూక్యోపనిషత్.

34. హరిః ఓం॥ ఓమిత్యేత దక్షరమిదం
సర్వం తస్యోప వ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి
సర్వమోంకార ఏవ యచ్చాన్య
త్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ ॥

తా॥ పరాపరబ్రహ్మ స్వరూపమైనట్టియు, అక్షరమగునట్టియు, ఆ ఓంకారముయొక్క ఉపవ్యాఖ్యానము. ఉప

వ్యాఖ్యానమనగ బ్రహ్మప్రాప్తి కుపాయమగుటవలన, బ్రహ్మ సమీపముగా స్పష్టముగా చెప్పుట ఉపక్రమింప బడుచున్నది. భూతము (జరిగినది) వర్తమానము (జరుగుచున్నది. భవిష్యత్తు (జరుగబోవునది) అనెడి కాలత్రయ పరిచ్ఛేదమేదికలదో, అదియు ఓంకారమే కాలత్రయాతీతమై కాలముచేత పరిచ్ఛేదముగాక, కార్యము మాత్రము చేతనే తెలిసికొనఁబడెడి అవ్యాకృతాదిక మేదికలదో, అదియు ఓంకారమే.

35. సర్వంగ్ హ్యేతద్బ్రహ్మాయ మాత్మా బ్రహ్మ
సోఽయమాత్మా చతుష్పాత్ ॥

తా॥ ఏ సమస్తము ఓంకారమాత్రమే చెప్పబడినదో, ఆ సమస్తము పరబ్రహ్మమే. బ్రహ్మమని పరోక్షముగ చెప్పబడిన దానినే, మరల ప్రత్యక్షముగ, "అయమాత్మా బ్రహ్మ"యని విశేషించి శ్రుతి చెప్పుచున్నది. ఈ ఆత్మ సౌకర్యార్థము చతుష్పాత్తుగ విభజించి, చెప్పబోవు దానినే, ప్రత్యగాత్మగ, అభినయ పూర్వకముగ శ్రుతి చెప్పినది. ఓంకారవాచ్యుడును, పరాపరస్వరూపుడును, అగు ఆత్మ, కార్షాపణమువలె (ఒకానొక నాణ్యమువలె) నాలుగు పాదములు గలవాడు.

36. సోయమాత్మాఽ ధ్యక్షర మోంకారో ఽధిమాత్రం।
పాదామాత్రా మాత్రాశ్చపాదా అకార ఉకారో
మకార ఇతి ॥

తా॥ ఈ ఆత్మ అధ్యక్షరము — అక్షరమే ఆలంబనముగ గలది. ఆ అక్షరమేమియనగా ఓంకారమే, ఆ ఓంకారము నాలుగు పాదములుగలదిగా మాత్రల ననుసరించి విభజింపబడుచున్నది. ఆత్మకు పాదములెట్టివో, ఓంకారమునకు మాత్రలట్టివి. ఆ మాత్రలేవియనగా, అకారము ఉకారము, మకారము అనునవి.

37. జాగరితస్థానో వైశ్వానరో ఽకారః
ప్రథమామాత్రాఽఽప్తే రాది మ
త్వాద్వాఽఽప్నోతి హవై సర్వాన్కా-
మానాదిశ్చ భవతి య ఏవంవేద ॥

తా॥ వెనుకటి మంత్రమునందు ఓంకార మాత్మ స్వరూపమని మొత్తముమీద చెప్పబడిన విషయమే, యీ మంత్రమునందు, విశ్వ, తైజస, ప్రాజ్ఞాది ఆత్మ పాదములకు, అకార, ఉకార, మకారాది మాత్రలకుగల

విశేషవిభేదము, యీ మంత్రమున చేయబడుచున్నది. జాగరితమే స్థానముగాగల వైశ్వానరుడెవడో అతడు ఓంకారముయొక్క అకారము (ప్రథమమాత్ర) వైశ్వానరుడు అకారమనుట యేసామ్యముచేతననగ, ఆప్తివలన, ఆప్తియనగ వ్యాపించుట. అకారముచేత వాక్ప్రపంచమంతయు వ్యాపింపబడియున్నది. ఇందులకు శ్రుతి ప్రమాణము, "అకారోవై సర్వావాక్" అకారముచేత వాక్ప్రపంచము యే విధముగ వ్యాపింపబడియున్నదో, అట్లే వైశ్వానరునిచేత జగమంతయు వ్యాప్తమైయున్నది. ఇందులకు శ్రుతి ప్రమాణము ఛాందోగ్యోపనిషత్. "తస్యహావై తస్యాత్మనో వైశ్వానరస్యమూర్థైవసు తేజాః" ఆదిగలది. ఆది మత్తనంబడును. అకారమనెడి యక్షరము. అక్షరములలో నెటుల మొదటిదో అట్లే వైశ్వానరుడున్ను మొదటివాడే. ఈ వెనుక చెప్పబడిన అకారము వాక్ప్రపంచమంతయు వ్యాపించియున్నదనెడి సామ్యము వలనగాని, లేక యీ ఆదిమత్వ సామ్యమువలనగాని, వైశ్వానరుడు అకారమగు చున్నాడు. (ఈవైశ్వానరుడున్ను, అకారమున్ను, యొకటియే యని నెఱింగినవానికి

కలుగు ఫలమేమనగా సకల మనోరథములను బొందు చున్నాడు. పూజ్యులలో మొదటివాడగుచున్నాడు.

38. స్వప్నస్థానస్తైజస ఉకారోద్వితీయా
మాత్రో త్కర్షాదు భయత్వాద్వోత్కర్షతి హ వై
జ్ఞానసంతతిం సమానశ్చ భవతి నాస్యా
బ్రహ్మవిత్కులే భవతి య ఏవం వేద ॥

తా॥ స్వప్నస్థానముగాగల యే తైజసుడుగలడో, అతడే ఓంకారముయొక్క ఉకారమనెడి ద్వితీయ మాత్ర. ఉకారము తైజసమనుటకు సామ్యమేమనగ, ఉత్కర్షము వలన, అకారముకంటె, ఉకారము పై భాగముననున్న దానివలె నుండును. అట్లే విశ్వునికంటె తైజసుడు పై భాగమున నుండును. ఉభయమగుటవలన అనగా అకార మకారములకు మధ్యస్థమైయుండుటవలన అట్లే విశ్వ ప్రాజ్ఞులకు మధ్యస్థుడై తైజసుడుండుటవలన నుభయుం డనంబడును. ఈ విషయము నెఱింగిన వానికి గల ఫలము జెప్పబడుచున్నది. విజ్ఞానసంతతిని (పుత్రులను శిష్యులను) వృద్ధిని పొందింపచేసుకొను చున్నాడు. మిత్రులగు వా రెట్లుందురో, అట్లె శత్రుపక్షము వారికిన్ని యితడు

ద్వేష్యుడుకాడు. ఇతనివంశమునందు బ్రహ్మవేత్తకాని వాడు జన్మింపడు.

39. సుషుప్తస్థానః ప్రాజ్ఞోమకార
స్తృతీయా మాత్రా మితేరపీతే
ర్వామినోతిహవా ఇదగ్ం సర్వమ
పీతిశ్చ భవతి య ఏవం వేద ॥

తా॥ సుషుప్తియే స్థానముగా గల యేప్రాజ్ఞుడుగలడో అతడే ఓంకారముయొక్క మకారమనెడి తృతీయమాత్ర. ఏ సామ్యముచేత మకారమును ప్రాజ్ఞుడని శ్రుతి పలుకుచున్నదనగా, మితివలన మితియనగ మానము (కొలత పాత్ర) విశ్వతైజసులు ప్రాజ్ఞునిచేత ప్రళయోత్పత్తి సమయములందు, ప్రళయ నిర్గమములచేత, తవ్వ, మానిక మున్నగు కొలత పాత్రలతో ధాన్యముకొలుచు నటుల కొలవబడుచున్నారు. అటులే ఓంకారము నొక పర్యాయముచ్చరించి, మరల నుచ్చరించునపుడు, అకార ఉకార మకారములందు ప్రవేశించి, బయలు వెడలుచున్నవాని వలె కనంబడును. అపీతివలన, "అపీతి" యనగా ప్రణవము. ఏకీభావము ఓంకారము నుచ్చరించు నపుడంత్యా

తురమగు మకారమునందు, అకార ఉకారములు ఏకీ
భావమును పొందుచున్నవానివలె నుండును. అట్లే విశ్వ
తైజసులు, సుషుప్తికాలమునందు ప్రాజ్ఞుని యందేకీభావ
మును పొందుదురు. ఈ సాదృశ్యముచేత ప్రాజ్ఞమకారము
లకు ఏకత్వము యుక్తమే. ఎవడీ విషయము నెఱుం
గునో అట్టి విద్వాంసుడు పొందెడి ఫలమేమనగా యీజగ
మంతయు కొలుచుచున్నాడని అనగా జగత్తుయొక్క
యాథార్థ్యమును యెఱుగుచున్నాడని యర్థము. "అపీతి"
యనగా జగత్కారణాత్మకుడగు చున్నాడని యర్థము.
ఈ మంత్రత్రయమునందు అవాంతర ఫలవచనము అనగా
విశ్వుడు అకారమని నెఱింగిన ఇట్టిఫలము గలుగుననియు
తైజసుడు ఉకారమని యెఱింగిన ఇట్టి ఫలము గలుగునని
యు, ప్రాజ్ఞుడు మకారమని నెఱిగిన యిట్టి ఫలముగలుగు
ననియు. విడివిడిగ ఫలమును బోధించుచున్నది. ఇట్లు
బోధించుటచే వేఱు వేఱు యుపాసనలు మాత్రముకావు.
మరేమన బ్రహ్మధ్యాన సాధన భూతమగు ఓంకారము
యొక్క స్తుతియందే, ఆవిధముగ బోధించిన దానికి తాత్ప
ర్యముగాని, యుపాసనా భేదములు చెప్పుటయందు మాత్ర
ము తాత్పర్యముగాదు.

40. అమాత్రశ్చ తుర్థో ఒవ్యవహార్యః
ప్రపంచోపశమశ్శివో ఒద్వైత
ఏవ మోంకార ఆత్మైవ
సంవిశ త్యాత్మనా౽ ఒత్మానం య ఏవం వేద ॥

తా॥ అమాత్రమనగా అకారాది మాత్రలులేనిది ఓంకారము అదియే చతుర్థము అనగా తురీయమగు నాత్మ మాత్రమే. అభిధానఅభిధేయ రూపములగు, వాక్కు, మనస్సులు క్షీణించుటచేత, అవ్యవహార్య మగుచున్నది. ప్రపంచోపశమమున్ను, మంగళస్వరూపమున్ను, అద్వైతమున్ను ఓంకారమే యగుచున్నది. ఈ విధముగ, ఓంకారమాత్రలు, ఆత్మపాదములు ఒకటియే యని యెఱింగిన వానిచేత, ప్రయుక్తమగు, త్రిమాత్రమగు ఓంకారము ఆత్మస్వరూపమే ఇట్టి జ్ఞాని మాత్రలను, పాదములను, తనయందు లీనమొనర్చుకొని, స్వరూపముచేతనే పరమార్థికమగు, ఆత్మస్వరూపమును బొందుచున్నాడు. పరమార్థవిదులగు బ్రహ్మవేత్తలు, మూడవదియగు బీజభావమును, దహింపచేసి ఆత్మయందు ప్రవిష్టులైనవారు కావునను తురీయునియందు బీజభావము లేక పోవుటచేతను, వారికి పుట్టుకయే లేదు. ఇది రజ్జువేగాని, సర్పముగాదని తెలి

సిన పిదప రజ్జువునందైక్యమైన సర్పము, తద్వివేకులకు మరల బుద్ధిసంస్కారమువలన పుట్టజాలదు గదా? ఉత్త మాధికారులుగాక, మందమాధికారులై, బ్రహ్మప్రాప్తి మార్గగాములై, ఆత్మప్రాప్తి సాధన భూతముగ, ఓంకార మాత్రలు ఆత్మపాదములు సమానులేయని యెఱింగి యుపాసించువారలకు, ఓంకారము బ్రహ్మప్రాప్తికి ఆలం బన మగుచున్నది.

41. ఓంకారంపాదశో విద్యా త్పాదామాత్రాన సంశయః
ఓంకారంపాదశో జ్ఞాత్వా నకించిదపి చింతయేత్ ॥

తా॥ ఓంకారమును పాదములుగా తెలిసికొనవల యును. ఈ విధముగ ఓంకారమును తెలిసికొనిన యెడల తాను కృతార్థుడగుచున్నాడు. కావున, దృష్టార్థమైనట్టి గాని అదృష్టార్థమైనట్టిగాని, ప్రయోజనమును కొంచమైన నతడు తలపెట్టగూడదు.

42. యుఞ్జీత ప్రణవేచేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।
ప్రణవేనిత్య యుక్తస్య నభయం విద్యతే క్వచిత్ ॥

తా॥ ఇట్టి ప్రణవమునందు సాధకుడు మనస్సును బొందింపవలయును. ప్రణవమే నిర్భయమగు బ్రహ్మము. ప్రణవమునందెల్లపుడు యుక్తుడై యుండువానికి దేనివల

నుండియు భయములేదు. ఇందులకు శ్రుతి ప్రమాణము "విద్వాన్ నబిభేతికుతశ్చన" (విద్వాంసుడగువాడు అనగా ఆత్మజ్ఞాని దేనివలననుండియు భయపడడు.)

43. ప్రణవో హ్యాపరం బ్రహ్మ ప్రణవశ్చ పరస్మృతః।
అపూర్వో ఽనతంరో ఽబాహ్యో ఽనపరః
ప్రణవో ఽవ్యయః ॥

తా॥ ప్రణవమే పరాపర బ్రహ్మ స్వరూపము. పర మార్థముగ ఓంకారమాత్రలు, ఆత్మపాదములు క్షీణింపగ పరుడగు ఆత్మయే బ్రహ్మమగును. అపూర్వమనగ పూర్వము కారణములేనిదనుట. అనంతరమనగ భిన్న జాతీయమగునది మరొకటిలేదనుట. అబాహ్యమనగ వేరగు బాహ్యపదార్థములు లేదనుట. అనపరమనగ మరియొక కారణము దీనికిలేదనుట. ఉప్పుకల్లునకు లోపల వెలుపలనంతట ఉప్పని రస మెటులుండునో, అదేవిధ ముగ ఆత్మ స్వరూపమగు ప్రణవము, బాహ్యాభ్యంతర ములయందు అజమని యభిప్రాయము.

44. సర్వస్య ప్రణవోహ్యాది ర్మధ్య మన్తస్తథైవచ।
ఏవం హి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదనంతరమ్॥

తా॥ ఆది, మధ్య, అంతములనగ యుత్పత్తి, స్థితి, ప్రళయములు. దారు గజము, రజ్జుసర్పము, ఎండమావులనీరు, స్వప్నమువలె ఘట్టుచున్న, ఆకాశాది ప్రపంచముల కంతయు, యింద్రజాలకుడు మున్నగు వారలే, యుత్పత్తి, స్థితి, లయములకు కారణభూతు నెట్లగుచున్నారో అట్లే ప్రపంచమునకు ప్రణవము, మాయావి మున్నగు వారివలె కారణభూతమగు చున్నది. ఇటుల నెఱింగినవాడు వెంటనే ఆత్మభావమును బొందుచున్నాడు.

45. ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితమ్।
సర్వ వ్యాపినమోంకారం మత్వాధీరో నశోచతి॥

తా॥ సకల ప్రాణిజాతములయొక్క స్మృతిప్రత్యయాస్పదమగు, హృదయమందున్న యీశ్వరునిగానే, ప్రణవము నుపాసించవలయును. ఆకాశమువలె యంతట వ్యాపించియున్నట్టి ఓంకారమును, అసంసారియగు ఆత్మగా నెఱింగిన బుద్ధిమంతునకు, శోకింపదగిన నిమిత్తమే లేదు. కావున అతడు శోకింపడు. ఇందులకు శ్రుతి ప్రమాణము "తరతిశోకమాత్మవిత్" మున్నగునవి.

46. అమాత్రో ఒనన్తమాత్రశ్చ ద్వైతస్యో పశమశ్శివః।
ఓంకారో విదితో యేన సమునిర్నేతరోజనః॥

తా॥ మాత్రారహితమైనట్టియు, తురీయమైనట్టియు, ఓంకారము, అనంతమాత్రము. మాత్రయనగ, ఇంత మాత్రమైనదని పరిచ్ఛేదము. అట్టి పరిచ్ఛేదము లేనిది యనంతమాత్రము. ఇంతమాత్రమైనది యిది యని నిర్ణయించి చెప్పుటకు వీలులేనిదని భావము. అనర్థాత్మకములగు సర్వవిధ ద్వైతములు, లేక పరమానందాత్మక స్వరూపము కలిగియుండుటచేత శివ మనంబడుచున్నది. ఇట్టి ఓంకారమును మాండూక్య శ్రుతి కారికలందు వివరింపబడిన దానిని యెవడెఱుంగునో, అట్టి వాడా పరమార్థతత్త్వమును సర్వదా స్మరించుచుండును. కావున యతడే ముని యని చెప్పబడును. ఈ ఓంకార తత్త్వము నెఱుంగనివాడు. శాస్త్రవేత్తయైనను, మునియని చెప్పుటకు అర్హతకాజాలడు.

## అథమైత్రాయిణ్యుపనిషత్.

47. ద్వేవావ బ్రహ్మణోరూపే మూర్తం
చామూర్తం చాథయన్మూర్తం తదసత్యం
యదమూర్తం తత్సత్యం తద్బ్రహ్మ
యద్బ్రహ్మ తజ్జ్యోతిర్యజ్జ్యోతిః స

ఆదిత్యః సవాఏష ఓమిత్యేతదాత్మా
స్వత్రే ధాత్మానం వ్యకురుత ఓమితి
త్రిస్రోమాత్రా ఏతాభిః సర్వమిదమోతం
ప్రోతం చైవాస్మి న్నిత్యేవం హ్యాహ
తద్వా ఆదిత్య ఓమిత్యేవం
ధ్యాయం స్తథాత్మానం యుంజీతేతి ॥

తా॥ బ్రహ్మకు మూర్తమని అమూర్తమని రెండు రూపములుగలవు. అందులో మూర్తమనునది ప్రపంచాత్మకము. అది అసత్యము. యేదైతే అమూర్తముగ నున్నదో (ఇంద్రియముల కగోచరమో) అది సత్యము. ఏదైతే వ్యాపక బ్రహ్మమో, అదే పరబ్రహ్మము. యేదైతేపరంజ్యోతియో, అదియే జ్యోతి అదియే యాదిత్యుడుగ (సమస్త వస్తువును ప్రకాశింపంజేయునదిగ) నున్నది. ఆదిత్యుడనే పరమాత్మ ఓంకారస్వరూపుడుగా యున్నాడు. ఆయాదిత్యుడు త్రిమూర్త్యాత్మకమగు తన రూపమును జేసెను. ఓమ్ అనునది మాత్రాత్రయ విశిష్టము. ఈ మాత్రలచేతనే ఓతప్రోత న్యాయముగ, (బాహ్యాభ్యంతరములునిండి) సమస్తము వ్యాపింప

బడియున్నదని చెప్పబడెను. అట్టియాదిత్యుడే (పరబ్రహ్మ మే) ఓంకార స్వరూపమని ధ్యానించుచు, ఆత్మను పర బ్రహ్మములో ఐక్యపరచ వలయును. పై జెప్పినరీతిగ మైత్రాయిణ్యుపనిషత్తు ప్రతిపాదించుచున్నది.

అథనారాయణోపనిషత్.

48. ఓంతద్బ్రహ్మ, ఓంతద్వాయు ఓమ్ తదాత్మా
ఓంతత్సత్యం ఓంతత్సర్వం ఓంతత్పురోన్నమః ॥

తా॥ ఆబ్రహ్మము ఓంకారవాచ్యముగ నున్నది. వాయువు (ముఖ్యప్రాణము) ఓంకార స్వరూపముగ నున్నది. ఆ ఆత్మయు ఓంకారస్వరూపమే. సత్యము ఓం కారమే. సమస్తము ఓంకారమే. అట్టి ఓంకారము కొఱకు నమస్కారము.

49. అద్వైత మనిర్వాచ్యం బ్రహ్మ, ప్రణవాత్మకం బ్రహ్మ,
ప్రణవాత్మకత్వేనోక్తం బ్రహ్మ, ప్రణవాద్యఖిల
మంత్రాత్మకం బ్రహ్మ, పాదచతుష్టయాత్మకం
బ్రహ్మ, కిం తత్పాదచతుష్టయం, (బ్రహ్మభవతి)
అవిద్యాపాదః, సువిద్యాపాదః, ఆనందపాదః,
తురీయపాదశ్చేతి, తురీయపాదః, తురీయ

తురీయం తురీయాతీతంచ కథంపాద చతుష్టయస్య భేదః. అవిద్యాపాదః, ప్రథమపాదః, సవిద్యా పాదోద్వితీయః ఆనందపాద స్తృతీయః, తురీయపాద స్తురీయః ఇతి ॥

తా॥ ఇచ్చట బ్రహ్మ స్వరూపము ప్రతిపాదింపబడు మన్నది. "ద్వితీయా ద్వైభ యంభవతి" అను శ్రుతి చొప్పున ద్వైతముకానిది అద్వైతము. భయరహిత మైనదని భావము. ఇటుల భయరహితమై అనిర్వాచ్యమై ఇంద్రియాతీతమై) యున్నది. బ్రహ్మము. ప్రణవస్వరూ పము బ్రహ్మమే. ప్రణవవాచ్యము బ్రహ్మమే. ప్రణవము మొదలుగాగల సకల మంత్ర స్వరూపము బ్రహ్మమే. అట్టి బ్రహ్మము నాలుగు పాదములతో గూడుకొని యున్నది. అట్టి నాలుగు పాదములతో గూడుకొనిన బ్రహ్మము యెట్టిదనగా? నాలుగుపాదములు (1) అవిద్యా పాదము. (2) సువిద్యాపాదము. (3) ఆనందపాదము. (4) తురీయపాదము — తురీయపాదమైతే, తురీయ తురీయము తురీయాతీతమని రెండు విధములు. ఆనాలుగు పాదములయొక్క భేదమెటులనగా? అవిద్యాపాదము

మొదటి పాదము. సువిద్యాపాదము రెండవది ఆనంద పాదము మూడవది తురీయపాదము నాలుగవది.

50. మూలావిద్యా ప్రథమపాదే నాన్యత్ర, విద్యానందతురీయాంశా స్సర్వేషుపాదేషు వ్యాప్యతిష్ఠంతి, ఏవం తర్హి విద్యాదీనాంభేదః కథమితి తత్తత్ప్రాధాన్యేన తత్తద్వ్యపదేశో వస్తుతస్త్వభేద ఏవ తత్రాధస్తన మేకం పాదమవిద్యా శబళంభవతి ఉపరితన పాదత్రయం శుద్ధబోధానంద లక్షణ మమృతం భవతి ॥

తా॥ ప్రథమ పాదములో మూలావిద్యయున్నది. విద్యానంద తురీయాంశములు. మిగత సమస్త పాదములలోను వ్యాపించియున్నవి. ఇటులైనచో భేదమెటులన "ప్రాధాన్యేన" వ్యపదేశమను న్యాయము చొప్పున (యే యే అంశములో యేది యేది ప్రధానమైనదో ఆ అంశమునుబట్టి వ్యవహరించుట విచారించగ యీ విద్యాదులన్నిటికి భేదమేను (అంతయు చైతన్యమే) ఆపాదములలో ప్రథమపాదము (అవిద్యాశబళం — అవిద్యతోకూడుకొన్నది.) గాయగుచున్నది. మిగత మూడు పాదములు

శుద్ధబోధానంద రూపమగు అమృత మయములుగ నగుచున్నది.

అథ తైత్తరీయోపనిషత్.

51. ఓమితిబ్రహ్మ ఓమితీదం సర్వంఓమిత్యే
తదను కృతిర్హ్మస్మవా అప్యోశ్రావయే
త్యాశ్రావయన్తి ఓమితి సామాని గాయన్తి
ఓమ్శోమితి శస్త్రాణిశంసంతి ఓమిత్యధ్వర్యుః
ప్రతిగరం ప్రతిగృణాతి ఓమితి బ్రహ్మ ప్రసౌతి
ఓమిత్యగ్నిహోత్రమను జానాతి
ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ
బ్రహ్మోపాప్నవానీతి బ్రహ్మోవోపాప్నోతి ॥

తా॥ ఓమ్ అనే శబ్దస్వరూపమును, బ్రహ్మమని నిర్విషయమగు మనస్సుతో ధారణజేసి యుపాసించవలయును. ఎందుకనగా? సమస్త శబ్దస్వరూపములు ఓంకారముచేతనే వ్యాపింపబడియున్నవి. వాచకమున్ను, వాచ్యమున్ను, రెండు ఓంకారస్వరూపములే? ఓంకారస్తుతి ప్రతిపాదింపబడుచున్నది. ఓంకారమే ముముక్షువులచేత నుపాసించదగియున్నది. "నాన్యః పంథా అయనాయ విద్యతే"

యన్నట్లు వేరే మార్గములేదు. ఓంకారము యను కరణ శబ్దముగానున్నది. అదెటులన? చేయుచున్నాను. పోవు చున్నాను. చేయబడినది. చెప్పబడినది. ఇత్యాది విష యములలో ఓ మని అనుకరణశబ్దము యనుభవసిద్ధమై యున్నది. ఇందువలన ఓంకారము అను కరణమని చెప్పం బడెను. "హాస్మవా" మొదలగు శబ్దములు ప్రసిద్ధార్థ మును తెలుపుచున్నవి. ఈ శబ్దములన్నిటికి, ఓంకారము యొక్క అనుకరణము ప్రసిద్ధమే. మరియు "ఓ శ్రావయ" అని ప్రేరణ పూర్వకముగా యాజ్ఞకులు యీ ప్రణవమునే ప్రతి ధ్వనించుచున్నారు. "సామగాః" - సామగానమును జేయువారలు. ఓమ్ అనియే సామమంత్రములను గాన ము చేయుచున్నారు. (శస్త్రమును పఠించువారలు) "ఓమ్ శోంసా" అని శస్త్రములను బఠించుచున్నారు. అటు లనే ఓ మనియే అధ్వర్యుడు ప్రతి గరము నుచ్చరించు చున్నాడు. బ్రహ్మ ఓం అనియే యనుజ్ఞ నిచ్చుచున్నాడు. ఓం అనియే అగ్నిహోత్రము ననుగ్రహించుచున్నాడు. బ్రాహ్మణుడు (శ్రోత్రియుడు) ఓమని ప్రవచించుచు, ఓమనియే యధ్యయనముచేయుచున్నాడు. బ్రహ్మను (వేదమును) బొందబోవుచున్నాను. అథవా నేను పర

మాత్మనుబొందితిని. ఆత్మను బ్రహ్మములో పొందించ బోవుచున్నానని ఓమని చెప్పుచున్నాడు. ఇటుల చెప్పి నందుచే ఫలించిన దేమనగా ఓంకారోపాసకుడు ఓం కారమునే ఆలంబనముగా గై కొని, బ్రహ్మమునే బొందు చున్నాడు. ఓంకార పూర్వకముగాచేయబడు క్రియలన్ని యు, తప్పక సఫలములగుచున్నవి. కనుక ప్రణవమునే పరబ్రహ్మమని విడువకనే యుపాసించవలయునని ఫలి తార్థము. ఈప్రకారముగా తైత్తరీయోపనిషత్తు యుప దేశించుచున్నది.

## అథప్రశ్నోపనిషత్.

52. మం॥ అథహైనం శైబ్యః సత్యకామః పప్రచ్ఛ
సయోహవై తద్భగవన్మనుష్యేషు
ప్రాయణాంత మోంకార మభిధ్యా యీత
కతమంవావసతేన లోకం జయతీతి ॥

తా॥ శిబికుమారుఁడగు సత్యకాముడు పిప్పలాది ముని నడిగెను. ఇచ్చట పరాపర బ్రహ్మ ప్రాప్తిసాధన భూతమగు ఓంకారముయొక్క ఉపాసన విధిని తెలిసి కొనుట కొఱకు, ప్రశ్న చేయబడుచున్నది. ఓ పూజ్యుడా!

మనుష్యులలో ఏ పురుషుడై తే ప్రాణప్రయాణ పర్యన్తము ఓంకారమునే చింతనజేయునో అనగా బాహ్య విషయములనుండి, ఉపసంహరింపబడిన యింద్రియములు గలవాడై; చిత్త సమాధానముతో గూడినవాడై, ప్రణవమునందు భక్తి పూర్వకమగు బ్రహ్మాభావముతో గూడి ఆత్మాను సంధానమును, అవిచ్ఛిన్నముగా (ఎడ తెగక) చేయుచు తదితర ప్రత్యయాన్తరా సంవలితుడై (బ్రహ్మాభావము తప్ప ఇతరజ్ఞానములేనివాడై) గాలిలేని దీపశిఖ మాడ్కి అచంచలుడగు చున్నాడో, మఱియు "సత్య బ్రహ్మచర్య, అహింసాऽ పరిగ్రహ, త్యాగసన్న్యాస శౌచ సంతోషమాయారాహిత్యము మొదలుగాగల యనేక యమ నియమాదుల ననుష్ఠించినవాడై, యీ ప్రకారముగా జీవితపర్యంతము, ఓంకారోపాసన జేయుచున్నాడో, అట్టిజ్ఞాని "కతమంవావ" యేయే లోకములను బొందుచున్నాడు. జ్ఞానముచేతను, కర్మముచేతను, బొందుటకు యోగ్యములగు అనేకలోకములుగలవు. వాటిలో ముందు చెప్పినరీతిగా యనుష్ఠించు ఓంకారోపాసకుడు యే లోకమును బొందుచున్నాడు ?

53. మం॥ తస్మై స్మైసహో వాచ ఏతద్వై
సత్యకామ పరంచా పరంచ బ్రహ్మ యదోంకారః
తస్మా ద్విద్వానేతే నైవాయ తనే నైకతరమన్వేతి॥

తా॥ ఈ ప్రకారముగ ప్రశ్నచేసిన సత్యకాముని కొఱకు పిప్పలాదుడు చెప్పెను. "ఏతద్వై సత్యకామ" ఓ సత్యకాముడా? యీ బ్రహ్మము పరమనియు, అపర మనియు, యిరు తెరంగులై బరగుచున్నది. పరమనగా? సత్యమైన, అక్షరమైనదియు, పురుషుడను పేరుగలదియునై యే పరబ్రహ్మము (నిర్గుణ బ్రహ్మము) చెప్పబడుచున్నదో అదియే పరము. అపరమనగా మొట్టమొదట పుట్టిన వాడును, ప్రాణమనే పేరుగలవాడెవడో (సగుణబ్రహ్మము) ఆ బ్రహ్మము యపరమని ప్రసిద్ధికెక్కెను. ఈ పరాపర బ్రహ్మములు రెండు ఓంకార స్వరూపములే. ఎందుకనగా ఓంకారమే ప్రతీకముగా (అవయవముగా) గలవగుట వలన యథార్థమగు యే పరబ్రహ్మముగలదో అది శబ్దా దులచే తెలియ బడునదిగాదు. సమస్త ధర్మవిశేషముల చేతను విడువబడినది. ఇట్టి యింద్రియాతీత బ్రహ్మము మనస్సుచేతనే తెలిసికొనుటకు సాధ్యపడదు. విష్ణ్వాది విగ్రహములు ఏలాగున పూజింపబడినవై పరమాత్మను

గ్రహపాత్రునిగా చేయుచున్నవో ఆవిధముగానే ప్రణవమున్ను, భక్తి శ్రద్ధలతో, బ్రహ్మభావముతోడి ధ్యానించువారలకు, పరమాత్మానుగ్రహమును గలుగ జేయుచున్నది. ఇదంతయు శాస్త్ర ప్రమాణసిద్ధమేను. అందువలన పరాపరబ్రహ్మములకు, రెంటికి యీ ఓంకారము యుపచారముగ (ప్రతీకముగ) అనగా ప్రతిమాస్థానీయముగనున్నది. అందువలన విద్వాంసుడు ఆత్మప్రాప్తిసాధన భూతమగు ఓంకార ధ్యానముచేత, పరమునుగాని, యపరమునుగాని పొందుచున్నాడు. ఈ ప్రణవమే పరబ్రహ్మప్రాప్తికి సమీపవర్తియగు ఆలంబనము.

"యోయదిచ్ఛతి తస్య తత్".

54. మం॥ సయద్యేక మాత్రమభి ధ్యాయీత స తేనైవ
సంవేదిత స్తూర్ణ మేవ జగత్యా మభిసంపద్యతే।
తమృచో మనుష్యలోక ముపనయంతే సతత్ర
తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంపన్నో
మహిమాన మనుభవతి ॥

తా॥ ఏ పురుషుడు ప్రణవముయొక్క సమస్తమాత్రల విభాగమును, గురు తెలుపంగనివాడైనను, ప్రణవచింతనా ప్రభావముచే, యుత్కృష్టగతినే పొందుచున్నాడు. ఇట్టి

ఓంకారమునే శరణుపొందినవాడు కర్మవిషయములోను లేక జ్ఞానవిషయములోను అసంపూర్ణతచే కొన్ని దోష ములతో కూడుకొన్నవాడైనను, వానికి "నహికల్యాణ కృత్ కశ్చిద్దుర్గతిం తాతగచ్ఛతి" యన్నట్లు రొుకప్పుడు కూడా దుర్గతియేలేదు. అట్లైనచో అట్టివాడెట్టి ఫలము ను బొందును? ప్రణవముయొక్క యేక మాత్రావిభాగ మును, తెలిసికొని కేవలం యేకమాత్రనే సర్వదా ధ్యా నించువాడు ఆ యేక మాత్రతో కూడుకొన్న ప్రణవ ధ్యానముచేతనే "సంవేదితః" – బాగుగా బోధింపబడిన వాడై, శీఘ్రములోనే భూలోకమును ప్రవేశించుచున్నా డు. లోకములో యనేక జన్మములు సంభవించుచున్నవి గదా వాటిలో అట్టి సాధకుని ఋఙ్మంత్రములు మనుష్య లోకమునే బొందించుచున్నవి. ఆ ఓంకారోపాసనచేత, ఆ సాధకుడు యీ మనుష్య జన్మములో బ్రహ్మజ్ఞానులలో శ్రేష్ఠుడై మంచి తపస్సుచేతను, నైష్ఠిక బ్రహ్మ చర్యము చేతను, దృఢమగు శ్రద్ధతో కూడుకొన్నవాడై, "మహి మాన మనుభవతి" విభూతి (ఆత్మజ్ఞాన సమృద్ధిని) అనుభ వించుచున్నాడు. ఆత్మజ్ఞానియగుననుట. కనుక యోగ భ్రష్టుడు రొుకపుడు గూడ దుర్గతినిపొందడు.

55. మం॥ అథ యది ద్విమాత్రేణమనసి సంపద్యతే
సో ఽంతరిక్షం యజుర్భిరున్నీయతే సోమలోకమ్ ।
ససోమలోకే విభూతి మనుభూయ పునరావర్తతే ॥

తా॥ ఇచట ద్విమాత్రా విశిష్ట ఓంకారోపాసనా ఫలము చెప్పబడుచున్నది. ఎవడు ద్విమాత్రా విభాగ ములను బాగుగా తెలిసి ద్విమాత్రతో కూడిన ఓంకార మును ధ్యానించునో అట్టి యుపాసకుడు స్వప్నరూపమైన మననాత్మకమైన, చంద్రదేవతయే యధిపతిగా గల యజుర్వేద రూపమగు మనస్సునందు "సంపద్యతే" స్థితిని పొందుచున్నాడు. అనగా యేకాగ్ర చిత్తుడై ఆత్మను భావించుచున్నాడు. ఇట్టి యుపాసకుడు మరణించిన తరు వాత అంతరిక్షమే యాధారముగాగల ద్వితీయ మాత్రా రూపమైన, సోమలోకమును, యజుర్వేద మంత్రములచేత పొందింపబడుచున్నాడు. అట్టి వానికి యజుర్మంత్రములే, సోమలోక సంబంధమగు జన్మను కలుగజేయుచున్నవి. ఆ ద్విమాత్రోపాసకుడు చంద్రలోకములోని సుఖములను బొందితిరుగా మనుష్యలోకమునకు వచ్చుచున్నాడు.

56. మం॥ యః పునరే తం త్రిమాత్రేణోమిత్యే
తేనైవాక్షరేణ పరంపురుష మభిధ్యాయీత
స తేజసి సూర్యే సంపన్నః యథాపాదో
దర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హవైస
పాప్మనా వినిర్ముక్తః స సామభిరు న్నీయతే
బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవ ఘనాత్పరాత్పరం
పురిశయం పురుష మీక్షతే తదేతౌ శ్లోకౌ
భవతః॥

తా॥ త్రిమాత్రలుగల ఓంకారమును యుపాసించునట్టి సాధకుడు త్రిమాత్రలకు గోచరమైన జ్ఞానముతో కూడుకొని అక్షరమగు ప్రతీకమైన ఓంకారముచేత "పరం పురుషం" పరమపురుషుని (సూర్యమండలాంతర్గతుని) యుపాసించునో యీ ఓంకారము ప్రతీకమగుటచేత "పరంచాపరంచ బ్రహ్మయదోంకారః" యని యభేద శ్రుతిచేతను ఓంకారమునకు సర్వధా సాధనత్వము నిష్పన్నమైనది. (సిద్ధించినది.) త్రిమాత్రా స్వరూపమగు ప్రణవ ధ్యానముచేత, తృతీయ మాత్రారూపమగు సూర్యునియందు స్థితిగలవాడగుచున్నాడు. అనగా సూర్యుని ధ్యానించువాడనుట. మరణించిన తరువాత సూర్యలోక

మునే పొందుచున్నాడు. చంద్రలోకమును బొందినవాని వలె తిరుగారాడు సర్పము యే విధముగ జీర్ణమైన తన చర్మమును వదలి (కుబుసము వదలి) మఱల క్రొత్తదిగ నెటులగు చున్నదో అటులనే ముందు చెప్పబడిన యుపాసకుడు "పాప్మనా" కుబుసముతో సమానమగు యశుద్ధవాసనచేత విడువబడినవాడై, తృతీయ మాత్రా రూపములైన, సామమంత్రములచే, బ్రహ్మలోకమును బొందింపబడుచున్నాడు. ఆ హిరణ్య గర్భుడు సమస్త జీవులకు యాత్మభూతుడు. ఆ అంతరాత్మ సమస్తభూత ములలో సూక్ష్మముగనున్నాడు. అట్టి హిరణ్య గర్భుని యందు సకల జీవులున్నవి. గనుక జీవఘనుడని చెప్ప బడెను. "జీవఘనాత్" హిరణ్యగర్భుని కంటె, "పరా త్పరం" పరమాత్మ యనే పేరుగల పురుషుని సమస్త శరీరములలో ప్రవేశించిన వానినిగా, తృతీయ మాత్రో పాసకు డెఱుంగుచున్నాడు. పై జెప్పబడిన యర్థముల ప్రకాశింపచేయునట్టి శ్లోకములు రెండు మంత్రములని యెఱుంగవలయును.

57. మం॥ తిస్రోమాత్రా మృత్యుమత్యః
ప్రయుక్తా అన్యోన్య సక్తా అనవి ప్రయుక్తాః ।

క్రియాసు బాహ్యాభ్యంతర మధ్యమాసు
సమ్యక్ ప్రయుక్తాసు న కంప తేజ్ఞః ॥

తా॥ ఇచ్చట ఓంకార మాత్రలయొక్క విశేషము వర్ణింపబడుచున్నది. ప్రణవముయొక్క మాత్రలగు అకార, ఉకార మకారములు మూడున్ను, మృత్యు గోచరములై యున్నవి. అనగా ముందు చెప్పిన మూడు మంత్రముల రీతిగా అకార ఉకార మకారోపాసకులు సంసారభూతములగు, భూలోక, చంద్రలోక, బ్రహ్మ లోకములను బొందుచున్నారు. ఆలోకాధిష్ఠాన దేవత లున్ను, యుపాధితో కూడుకొన్నవారలే. ఆ దేవతలు అపరబ్రహ్మమని చెప్పబడుచున్నవి. ఆ మూడు మాత్ర లు పరస్పరము కలిసియున్నవి. మఱియు నవి అనభి ప్రయుక్తములుగనున్నవి. "అనభిప్రయుక్తాః"—విశేషము గా ప్రయోగింపబడినవి. అవి ప్రయుక్తము లనంబడును. విప్రయుక్తములు కానివి. విప్రయుక్తములు అనగా విశేషముగ ప్రయోగింపబడనవి యనుట. అవికానివి అనభిప్రయుక్తములు. ఇటుల చెప్పినందుచే బాగుగా ప్రయోగింపబడినవి బాగుగా నొక దానియందే ప్రయో గింపబడునవి యని అర్థము సిద్ధించినది. ఇట్లు చెప్పుట

యేమి ఫలితార్థము. ధ్యానకాలమునందే జాగ్రత్స్వప్న సుషుప్తి స్థానములయొక్క, (విశ్వతైజస ప్రాజ్ఞులయొక్క) చింతనా రూపములగు బాహ్యాభ్యంతర మధ్యమ క్రియలు విశేషముగా ప్రయోగింపబడగా అట్టి యోగీశ్వరుడు చలించడు. పూర్వము జెప్పిన రీతిగా ఓంకారముయొక్క విభాగమును గుర్తెరిగి చలనత్వమనేది పొందడు. (ధ్యానమునుండి చలింపడనుట) ఉత్కృష్టగతినే పొందును. యెందువలననగా జాగ్రత్ స్వప్నసుషుప్త్యవస్థాభిమాని దేవతలగు విశ్వతైజసు ప్రాజ్ఞులను మాత్రాత్రయ రూపమగు ఓంకారోపాసనచేత సాక్షాత్కరించుచున్నాడు. అనగా, ఓంకారస్వరూపునిగా చూచుచున్నాడు. ఇట్టి ఓంకారోపాసకునకు యుత్కృష్టగతియేగాని చలనగతిలేదు.

58. మం॥ ఋగ్భిరేతం య జుర్భిరంతరిక్షం
సామభిర్యత్తత్క వయో వేదయంతే।
తమోంకారేణైవాయతనే నాన్వేతి విద్వాన్
యత్తచ్ఛాంత మజర మమృత మభయం పరంచేతి॥

తా॥ ఋఙ్మంత్రములచేత మనుష్యలోకమును, యజుర్వేదమంత్రములచేత సోమాధిష్ఠితమగు అంతరిక్షమును, (సోమలోకమును) సామమంత్రములచేత, మూడవదగు

బ్రహ్మలోకమును, కవయః=మేధావంతులగు విద్వాంసులు తెలిసికొనుచున్నారు. అనగా అపరబ్రహ్మ స్వరూప మగు యీ మూడు లోకములను ఓంకార రూపసాధ నముచేతనే విద్వాంసులు పొందుచున్నారు. అట్టి ఓంకా రముచేతనే (ఓంకార చతుర్థపాద విభాగజ్ఞానముచేతనే) సత్యమైన, పరమైన, అక్షరమై శాంతమై, విముక్తమైనట్టి యు, జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది విశేష సర్వప్రపంచము చేత విడువబడినది కనుకనే అజరం=జరావస్థలేనిదియు, అమృతం=మరణములేనిదియు, ఇందువలననే జరావిక్రియ రహితమున్ను, భయవర్జితమున్ను, అందువలననే నిరతి శయమైనట్టి పరబ్రహ్మమును, "ఓంకారేణ ఆయతనేన" ప్రణవరూపమార్గముచేత పొందుచున్నాడు. ఈ ప్రకా రముగ ప్రశ్నోపనిషత్తు యుద్బోధించుచున్నది.

## అథబ్రహ్మోపనిషత్.

59. మం॥ ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం
ధ్యాన నిర్మథనా భ్యాసాద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥

తా॥ ఆత్మను క్రింది అరణిగాను, ప్రణవమును మీాది అరణిగానుజేసి ధ్యానమనెడి మథనా భ్యాసము వలన

రహాస్యమగు పరబ్రహ్మమును సాధకుడు గుర్తెఱుంగు చున్నాడు.

అథగర్భోపనిషత్.

60. మం॥ సమ్యగ్జ్ఞానాద్ధ్యానాత్ అక్షరమోంకారం
చింతయతి తదేవ చైకాక్షరం జ్ఞాత్వాష్టౌ ॥

తా॥ గర్భములోని శిశువునకు యెనిమిది మాసములు రాగానే వానికి పూర్వజ్ఞాన ముండుటవలనను, ధ్యానము వలన, అక్షరమైన ఓంకారమునే జింతించుచున్నాడు. అట్టి అక్షరమగు పరబ్రహ్మను తెలిసికొనుచున్నాడు.

అమృతనాదోపనిషత్.

61. మం॥ అఘోషమవ్యం జనమస్వరంచ
యత్తాలు కంఠోష్ఠమనాసికంచయత్
అరేఫజాత ముభయోష్మ వర్జితం
యదక్షరం నక్షరతే కథంచిత్ ॥

తా॥ ఈ ప్రణవము అఘోషం=ఘోషప్రయత్నము లేనిది. అనగా హాశ్శులు=హ, య, వ, ర, ల, ఞ, మ, ఞ, ణ, న, ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, యీ అక్షరములకంటె, భిన్నమైనదియు, హల్లు, అచ్చు,

కానిదియు తాలుస్థానీయములగు, ఇకార, చవర్గ, యకార, శకారములలోను చేరనిదియు, నాసికాక్షరము లగు ఙ, మ, ఞ, ణ, న వీటికంటెను, వేఱైనదియు, రేఫమువలన కలుగనిదియు, సంధ్యక్షరములు ఆ, ఏ, ఐ, ఓ, ఊష్మలు, శ, ష, స, హ, వీటికంటెను విలక్షణమై నదియు నగుచున్నది. పై జెప్పబడిన, అక్షరములన్ని యు, హల్లనిగాని, అచ్చనిగాని, విభాగముచేయుటకు వీలగుచున్నది. ఈ ప్రణవమో; అటుల విభజించుటకు సాధ్యముగాదు. అక్షరములన్నియు నా, యాస్థానము లందు కలుగుచున్నవని చెప్పుటచే, అవి యన్నియు క్షర భావమును పొందుచున్నవి. ఈ ప్రణవము యేస్థానము నుండి కలుగుచున్నదో అని చెప్పుటకు వీలులేసందుచే అక్షరమయ్యేయున్నది. వర్ణములన్నియు అక్షరమగు ప్రణవమునుండియే జనించినందువలన వాటికన్నిటికి అక్షరత్వము సిద్ధించినది.

62. మం॥ యేనా సాగచ్ఛతే మార్గం ప్రాణ స్తేనాభి
గచ్ఛతి।
అత స్తమభ్యసేన్నిత్యం యన్మార్గ గమనాయవై ॥

తా॥ ప్రణవధ్యానముచేయు యోగి యే అర్చిరాది మార్గమును బొందునో ప్రాణముగూడ యా మార్గముననే బోవును. కనుక యాయర్చిరాది మార్గముకొఱకు (తిరుగ రాకుండుటకొఱకు) ఆ ప్రణవాభ్యాసమునే నిత్యముచేయు చుండవలయును.

## కఠోపనిషత్.

మం॥ అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాదన్య
త్రాస్మాత్కృతా కృతాత్ ।
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ
య త్తత్పశ్యతి తద్వద ॥

తా॥ శాస్త్రీయ ధర్మానుష్ఠానము. తత్ఫలము కర్తృ కారకాదులు. వీటికంటెను విలక్షణమైనదియు, అటులనే యధర్మముకంటె వేరైనిదియు, "కృతాకృతాత్" కృత మనగా కార్యము అకృతమనగా కారణము. ఈ కార్య కారణముకంటెను. "కార్యోపాధిరయం జీవః కారణో పాధి రీశ్వరః కార్యకారణ తాంహిత్వా పూర్ణబోధో ఉవశిష్యతే" అన్నట్లు విభిన్నమైనదియు, భూత భవిష్య ద్వర్తమానము కంటె అతీతమైనదియు, సమస్త వ్యవహార

ములకు యగోచరమైనదియు, (నీవునేననెడి భేదజ్ఞానము లకు) విషయము కానట్టి యే పరబ్రహ్మమును, తెలియు చున్నావో, యోగ్యుడైన నాకుయద్దానిని దెలియజేయుము. అని నచికేతుడు యమధర్మరాజును బ్రశ్నించెను.

ఓంకారోపదేశము.

యమధర్మరాజు సాధనచతుష్టయ సంపత్తిగల యుత్తమాధికారియగు నచికేతునికి ఉపదేశించిన యమూల్యమైన ప్రణవోపాసన ప్రతిపాదింపబడుచున్నది.

63. మం॥ సర్వేవేదాయత్పదమా మనంతి తపాంసి
సర్వాణిచయద్వదన్తి । యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం
చరన్తి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమి త్యేతత్ ”

తా॥ సమస్తవేదములు యేకమైన ప్రాప్యమగు ముఖ్యస్థానముగా, యెద్దానిని చెప్పుచున్నవో, సమస్తతపస్సులేస్థానమును బొందదగిన వస్తువునుగా బోధించుచున్నవో, యే యగమ్యాగోచరమగు విషయమును వాంఛించినవారలై గురుకులవాసాది లక్షణయుతమైన బ్రహ్మచర్యమును అనుష్ఠించుచున్నారో (ఆత్మారాముని యందు రమించుచున్నారో) అట్టి పరబ్రహ్మమును సంగ్రహముగా

చెప్పుచున్నాను, ఓమితి=ఓమని, అట్టి పరబ్రహ్మము ఓంకారశబ్దవాచ్యముగాను, ఓంకారశబ్దమే ప్రతీకముగా గలదిగా యున్నది.

64. మం॥ ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరంపరమ్
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యోయదిచ్ఛతి తస్యతత్

తా॥ ఈయక్షరమైన ప్రణవమే, యపరబ్రహ్మము (సగుణము) ఈ అక్షరమగు ఓంకారమే పరము (నిర్గుణ బ్రహ్మము) ఈపరాపర బ్రహ్మ రెండింటికి యీ ఓంకారమే ప్రతీకమనుట. ఈ యక్షరమైన యుపాస్యమగు బ్రహ్మమును గుర్తెరింగి ప్రణవముచేత యెవరు యుపాసించుచున్నారో ఆసాధకులు యిష్టమైన పరమునుగాని యపరమునుగాని బొందుచున్నారు. (వారు దేనిని గురించి సకల్పించుదురో ఆ ఫలములన్నియు ఫలించును.)

65. ఏతదాలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరమ్।
ఏ తదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥

తా॥ బ్రహ్మస్థానమును బడయగోరువారికి యీప్రణవమే శ్రేష్ఠము అనగా ప్రశంసింపదగిన యాధారము, "నాన్యః పంథావిద్యతేఽయనాయ" యన్నట్లు ఇంతకన్న

వేరేమార్గములేదు. పరాపరబ్రహ్మలకు నిదియే (ప్రణవమే) ఆలంబనము. ప్రణవరూపమగు అత్యుత్తమమైన యాధారమును దెలిసికొన్నవాడు "బ్రహ్మలోకే మహీయతే" పరబ్రహ్మము నందుంటున్నవాడై అపారమహిమాన్వితుడగుచున్నాడు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" యను శ్రుతి చెప్పిన యాసాధకుడు బ్రహ్మమును తెలిసికొని బ్రహ్మవిత్తై బ్రహ్మమేయగుచున్నాడు. ఈ ప్రకారముగ కఠోపనిషత్తు బోధించుచున్నది.

## అథనాదబిందూపనిషత్.

∴ ప్రణవమే హంస రూపముగా చెప్పబడుచున్నది.

66. మం॥ అకారోదక్షిణః పక్ష ఉకారస్తూత్తరస్స్మృతః।

మకారం పుచ్ఛమిత్యాహు రర్ధమాత్రాతుమస్తకమ్

పాదాదికం గుణాస్తస్య శరీరం తత్త్వముచ్యతే।

ధర్మోస్య దక్షిణం చక్షురధర్మో ఽథోఽపరస్స్మృతః

తా॥ ప్రణవమను హంసపక్షికి అకారము దక్షిణపార్శ్వపు రెక్కగాను, ఉకారము యుత్తరపార్శ్వపు రెక్కగాను జెప్పబడినది. మకారమును తోకగాను, అర్ధమాత్రను శిరస్సుగాను నుడివిరి. శరీరము తత్త్వముగాను

చెప్పబడెను. ఆప్రణవ పక్షికి గుణములు పాదములు మొదలుగాగలవి. కుడినేత్రము ధర్మము ఎడమనేత్రము అధర్మమనియు చెప్పబడెను.

మం॥ భూర్లోకః పాదయో స్తస్య భువర్లోకస్తుజానునీ ।
సువర్లోకః కటీదేశే నాభిదేశే మహార్జగత్ ॥
జనోలోకస్తు హృద్దేశే కంఠేలోక స్త పస్తతః ।
భ్రువోర్లలాట మధ్యేతు సత్యలోకో వ్యవస్థితః ॥
సహస్రార్ణమతీవాత్ర మంత్ర ఏష ప్రదర్శితః ।
ఏవమేతాం సమారూఢో హంసయోగవిచక్షణః ॥

తా॥ భూలోకము పాదములు, భువర్లోకము జానువులు, సువర్లోకము కటిప్రదేశములు, మహర్లోకము నాభిప్రదేశము, జనలోకము హృదయము, తపోలోకము కంఠము, సత్యలోకము లలాట మధ్యప్రదేశము. ఈ ప్రకారముగా ప్రణవ హంస పక్షియొక్క యవయవములు చెప్పబడినవి. ఈ ప్రణవమంత్రము సహస్రారములో వ్యాపించియున్నది. హంసయోగి యీ ప్రణవపక్షిని వాహనముగా జేసికొని పరబ్రహ్మ ప్రాప్తిరూప గమనము చేయుచున్నాడు. మఱియు బ్రహ్మదేవునికి హంసపక్షి వాహనమని చెప్పెదు. రహస్యమిది. అనగా యీ

ప్రణవమగు హంసను యాధారము చేసికొని, చతుర్ముఖ బ్రహ్మ పరబ్రహ్మమును బొందుచున్నాడు.

67. మం॥ నభిద్యతే కర్మచారైః పాపకోటిశతైరపి।
ఆగ్నేయీ ప్రథమా మాత్రా వాయవ్యేషా తథాపరా ॥

భానుమండల సంకాశాభవేన్మాత్రాతథోత్తరా।
పరమాచార్ధ మాత్రాయా వారుణీంతాంవిదుర్బుధాః
కాలత్రయేపి యస్యేమా మాత్రానూనంప్రతిష్ఠితాః
ఏష ఓంకార ఆఖ్యాతో ధారణాభిర్నిబోధత ॥

తా॥ ఇట్టి ప్రణవోపాసకునికి యనేక పాపకర్మలు నశించుచున్నవి. ఆసాధకుడు కర్మలచేత బంధింపబడడు. ఈ ప్రణవముయొక్క ప్రథమమాత్ర ఆగ్నేయి యనియు, రెండవ మాత్ర వాయవ్యియనియు మూడవది సూర్య మండలముతో సమానమైనదనియు, మిగిలిన యర్థమాత్ర పరమమై వారుణియనియు, పండితులు చెప్పుచున్నారు. మూడుకాలములలోను, దేనికైతే యీ మాత్రలు స్థిర ములై యున్నవో యదియే ఓంకారముగ చెప్పబడెను. ఈ విషయము ధారణాశక్తిచేత తెలిసికొనవలయును.

68. మం॥ ఘోషిణీ ప్రథమా మాత్రావిద్యున్మాత్రా
తథాపరా।
పతంగినీ తృతీయాస్యా చ్చతుర్థీ వాయువేగినీ ॥
పంచమీ నామధేయాతు షష్ఠీచైన్ద్రీత్యభిధీయతే।
సప్తమీ వైష్ణవీనామ అష్టమీ శాంకరీతిచ ॥
నవమీమహతీనామ ధృతిస్తు దశమీమతా ॥
ఏకాదశీ భవేన్నారీ బ్రాహ్మీతు ద్వాదశీపరా ॥

తా॥ ప్రణవముయొక్క ద్వాదశ మాత్రలు (పండ్రెండు మాత్రలు వివరింపబడుచున్నవి.

(1) ఘోషిణీ (2) విద్యున్మాత్ర (3) పతంగిని (4) వాయువేగిని (5) నామధేయ (6) చైంద్రి (7) వైష్ణవి (8) శాంకరి (9) మహతి (10) ధృతి (11) నారి (12) బ్రాహ్మి

69. మం॥ ప్రథమాయాంతు మాత్రాయాం
యదిప్రాణైర్వియుజ్యతే।
భరతేవర్షరాజాఽసౌ సార్వభౌమః ప్రజాయతే॥
ద్వితీయాయాం సముత్క్రాన్తోభవేద్యక్షో
మహాత్మవాన్।
విద్యాధరస్తృతీయాయాం గంధర్వసుచతుర్థకా ।

పంచమ్యా మథమాత్రాయాం యది ప్రాణైర్వి
యుజ్యతే।
ఉషిత స్సహ దేవత్వం సోమలోకేమహీయతే॥
షష్ఠ్యామింద్రస్య సాయుజ్యం సప్తమ్యాం వైష్ణవం
పదన్ ।
అష్టమ్యాం వ్రజతే రుద్రం పశూనాంచ పతింతథా।
నవమ్యాంతు మహర్లోకం దశమ్యాంతు జనంవ్రజేత్
ఏకాదశ్యాం తపోలోకం ద్వాదశం బ్రహ్మశాశ్వతన్
తా॥ ఇక ద్వాదశ మాత్రలయొక్క ఫలితమును వేఱు వేఱుగా చెప్పుచున్నారు. ప్రథమ మాత్రోపాసకుడు మరణించిన తరువాత, భరతవర్షములో సార్వభౌముండై పుట్టుచున్నాడు. ద్వితీయ మాత్రోపాసకుడు శరీరమును విడచినవాడై, మహామహిమ శాలియగు యక్షుడగుచున్నాడు. తృతీయ మాత్రోపాసకుడు ప్రాణము విడిపోయిన తరువాత విద్యాధరుడగు చున్నాడు. చతుర్థ మాత్రోపాసకుండు గంధర్వుడగు చున్నాడు. పంచమి మాత్రోపాసకుడు మృతిపొందిన తరువాత దేవత్వమును బొంది చంద్రలోకములో పూజ్యుడగుచున్నాడు. ఆఱవ మాత్ర నుపాసించువాడు ఇంద్రునియొక్క సాయుజ్యమును

ఏడవమాత్ర నుపాసించువాడు వైష్ణవస్థానమును, అష్ట మాత్రోపాసకుండు రుద్రుని, నవమీ మాత్రోపాసకుడు మహర్లోకమును, పదియవమాత్రోపాసకుడు జనలోకము ను, యేకాదశి మాత్రోపాసకుడు తపోలోకమును, ద్వా దశ మాత్రోపాసకుడు బ్రహ్మపదవిని, దేహమును విడ చిన తరువాత వీరలు పొందుచున్నారు.

70. మం॥ తతః పరతరం శుద్ధం వ్యాపకం నిర్మలం శివమ్
సదోదితం పరంబ్రహ్మ జ్యోతిషా ముదయో యతః
అతీంద్రియం గుణాతీతం మనోలీనం యథా భవేత్
అనుపమం శివం శాంతం యోగయుక్తం సదావిశేత్
తద్యుక్తస్తన్మయోజన్తుః శనైర్ముంచేత్ కళేవరన్
సంస్థితో యోగ చారేణ సర్వసంగ వివర్జితః ॥
తతో విలీన పాశో సౌవిమలః కమలా ప్రభుః।
తేనైవ బ్రహ్మ భావేన పరమానంద మశ్నుతే ॥

తా॥ ఎప్పుడు మనస్సు లీనమగునో యప్పుడు, యోగ యుక్తుడైనవాఁడు (ప్రణవాను సంధానముచేయువాడు) శ్రేష్ఠతరమైనదియు, శుద్ధమైనదియు, వ్యాపకమును, నిర్మలమును, శివమును, సర్వదాయుదయమును,

బొందినదియు, సమస్త జ్యోతిష్కులయొక్క యుత్పత్తి దేనివలననో, పరబ్రహ్మయు ఇంద్రియములను, గుణముల నతిక్రమించినదియు, సాటిలేనిదియు, మంగళస్వరూపమైన దియు, శాంతమగు పరమాత్మను యెల్లప్పుడు పొందు చున్నాడు. అట్టి ప్రణవాను సంధానముతో కూడికొనిన వాడు పరబ్రహ్మ స్వరూపుడై మెల్లగా శరీరమును విడు చును. సర్వసంగ వివర్జితుండై ప్రణవయోగమును శీలిం చినవాడు మరణానంతరము, సంసార రహితుండై, విష్ణు స్వరూపుండై, ఆ బ్రహ్మభావముచే పరమానందమును బొందుచున్నాడు.

71. మ॥ బ్రహ్మప్రణవ సంధానం నాదోజ్యోతిర్మయశ్శివః
స్వయమావిర్భవేదాత్మా మేఘాపాయే ఽంశుమానివ ॥
సిద్ధాసనే స్థితో యోగీ ముద్రాంసాధయ వైష్ణవీమ్ ।
శృణుయాద్దక్షిణేకర్ణే నాదమంతర్గతంసదా ॥
అభ్యస్యమానో నాదో ఽయం బాహ్యమావృణుతేధ్వనిః।
పక్షాద్విపక్షమఖిలం జిత్వాతుర్య పదంవ్రజేత్ ॥
శ్రూయతే ప్రథమాభ్యాసే నాదోనానా విధోమహాన్ ॥
వర్ధమానే తథాభ్యాసే శ్రూయతే సూక్ష్మసూక్ష్మతః ॥

ఆదౌ జలధి జీమూత భేరీనిర్ఝర సంభవః ।
మధ్యేమర్దల శబ్దాభో ఘంటాకాహలజస్తథా ॥
అంతేతు కింకిణీవంశ వీణాభ్రమర నిస్స్వనః ।
ఇతినానా విధానాదాః శ్రూయన్తే సూక్ష్మసూక్ష్మతః ॥
మహతి శ్రూయమాణేతు మహాభేర్యాదికధ్వనౌ ।
తత్రసూక్ష్మం సూక్ష్మతరం నాదమేవ పరామృశేత్ ।
ఘనమత్సృజ్యవాసూక్ష్మే సూక్ష్మముత్సృజ్యవాఘనే ।
రమమాణ మపిక్షిప్తం మనోనాన్యత్రచాలయేత్ ॥
యత్రకుత్రాపివానాదే లగతిప్రథమంమనః ।
తత్ర తత్రస్థిరీభూత్వా తేన సార్ధం విలీయతే ॥
విస్మృజ్య సకలంబాహ్యం నాదే దుగ్ధాంబు వన్మనః ॥
ఏకీభూయాథ సహసా చిదాకాశే విలీయతే ॥
ఉదాసీనస్తతోభూత్వా సదాభ్యాసేనసంయమీ ।
ఉన్మనీ కారకంసద్యో నాద మేవావ ధారయేత్ ॥

తా॥ ప్రణవనాద బ్రహ్మోపాసన చెప్పబడుచున్నది. ఈ యుపాసన చేయువాడు ప్రణవశబ్దమందే మనస్సును లయింపచేసినచో, శీఘ్రముగా చిత్తైకాగ్రత కలిగి అంత రాత్మయందే క్రీడించుచున్నాడు. మేఘములు పోగా సూర్యుడేవిధముగా స్వయముగానే ప్రకటనమగునో,

యీవిధముగ బ్రహ్మమునందు ప్రణవాను సంధానముచే కలిగెడు నాదస్వరూపమైనట్టియు, జ్యోతి స్వరూపమైన శివమైన ఆత్మ ఆవరణము తొలంగగానే, తనంతటతానే ప్రకాశించుచున్నది. యోగీశ్వరుడు సిద్ధాసనమందున్న వాడై, వైష్ణవముద్రనుధరించి, కుడిచెవిలో అంతర్గతమైన ప్రణవధ్వనిని యెల్లప్పుడు వినవలయును. ఈ విధముగా అభ్యసింపబడిన నాదము, బాహ్యాధ్వనిని ప్రకటించును. అనగా బాహ్యమునందుకూడా స్పష్టముగా వినబడు నను ట. తరువాత సకల ప్రతిబంధములను విడనాడి, యా నాదము తురీయపదమును జేరును. (సహస్రారమును జేరును) ప్రథమా భ్యాసకునికి యనేకవిధములై, గొప్ప గొప్ప ధ్వనులు వినబడును. అభ్యాసము చేయగా, చేయ గా మొదట వృద్ధిపొందినదై ఆనాదము సూక్ష్మసూక్ష్మ ముగా వినబడును. మొదట సముద్రము, మేఘము, భేరీ, ప్రవాహము వీటివలన కలిగెడు ధ్వని వినబడును. మధ్యకాలములో మృదంగశబ్దమువంటి శబ్దము, ఘంటా నాథము. కాహల ధ్వని యివి వినబడును. అంతములో గజ్జెలు ఏకనాదము (తాంబుర) వీణా, తుమ్మెదలు వీటి ధ్వని వినబడుచున్నవి. ఈవిధముగా ననేక సూక్ష్మమైన

ధ్వనులు వినబడుచున్నవి. గొప్పదగు భేర్యాది ధ్వనుల వినబడగా ఆధ్వనులలో సూక్ష్మమైనట్టియు, మిక్కిలి సూక్ష్మమైనట్టియు, నాదమునే గ్రహించవలయును గొప్ప ధ్వనిని వదలి, సూక్ష్మ ధ్వనియందును, సూక్ష్మ ధ్వనిని త్యజించి, మహాధ్వనియందును మనస్సు నుంచిన చో అది అక్కడనే రమించుచున్నదై కొంచముకూడా చలించదు. మొదట మనస్సు యేదోయొక నాదములో సంబంధించును. ఆనాదములోనే స్థిరముగానుండి నాద ముతోకూడా మనస్సున్ను లయించును. బాహ్య ప్రపం చము సమస్తమున్ను మరచి క్షీరములో జలమువలె ప్రణవనాదమునందు మనస్సు లయించి శీఘ్రముగ చిదా కాశములో లయమగుచున్నది. ఈ ప్రకారముగా సదా యభ్యసించు యోగి యుదాసీనుండై దేనిని యంటని వాడై మనస్సును లయింపజేయునటువంటి నాదమునే శీఘ్రముగ ధారణజేయును.

72. మం॥ సర్వచింతాం సముత్సృజ్య సర్వచేష్టావివర్జితః
నాదమేవాను సందధ్యాన్నాదే చిత్తంవిలీయతే ॥

తా॥ ప్రణవనాదోపాసకుడు సమస్త చింతలనువదలి బ్రహ్మభావముతో కూడుకొన్నవాడై సమస్తేంద్రియ

చేష్టలనువదలి నాదమునే యనుసంధానము చేయవలయు
ను. నాదములో మనస్సు లయించుచున్నది.

73. మం॥ మకరందం పిబన్ భృంగో గంధాన్ నాపేక్షతే
యథా ।

నాదాసక్తం సదాచిత్తం విషయం నహికాంక్షతే ॥
బద్ధస్సునాద గంధేన సద్యస్సంత్యక్తచాపలః ।
నాదగ్రహణ తశ్చిత్త మంతరంగం భుజంగమమ్ ॥
విస్మృత్య విశ్వమేకాగ్రం కుత్రచి న్నహిధావతి ।
మనోమత్త గజేన్ద్రస్య విషయోద్యానచారిణః ॥
నియామన సమర్థోయం నినాదో నిశితాంకుశః ।
నాదోంతరంగసారంగ బంధనే వాగురాయతే ॥
అంతరంగసముద్రస్య రోధే వేలాయతేపిచ ।
బ్రహ్మప్రణవ సంలగ్ననాదో జ్యోతిర్మయాత్మకః ॥

తా॥ భ్రమరము పుష్పమునందుగల మధువును,
త్రాగుచున్నదై, యితర గంధములను యెటుల అపేక్షిం
చదో, అటులనే ప్రణవనాదమునందు ఆసక్తమగు మన
స్సు విషయాదులనుకోరదు. అంతరంగమను సర్పము
మనోహరమగు నాదముయొక్క, సంస్కారముచేత, బం
ధింపబడినదై, తత్క్షణమే సమస్త చపల స్వభావమును

వదలి, ప్రణవనాదము సందే లయించుచున్నది. అందు వలన యట్టి మనస్సు ప్రపంచమును మరచి, యేకాగ్రమైనదై మఱియొక చోటికి పరుగిడదు. విషయములనే యుద్యానములో సంచరించునట్టి మనస్సనెడి మత్తగజేంద్రముని నియమించుటలో సమర్థమైనటువంటి, తీక్ష్ణమైన అంకుశము ప్రణవధ్వనియే! చిత్తమనెడు బెగ్గురు పక్షిని బంధించుటలో, ప్రవణనాదమే ఉచ్చు అగుచున్నది. అంతరంగమనెడి సముద్రమును యడ్డగించుటలో, ప్రణవనాదము చెలియలకట్టగుచున్నది. బ్రహ్మ స్వరూపమగు ప్రణవమునకు సంబంధించిన ధ్వనిజ్యోతి స్వరూపమని చెప్పఁబడుచున్నది.

74. మం॥ మనస్తత్ర లయంయాతి తద్విష్ణోః పరమంపదమ్
తావదాకాశ సంకల్పో యావచ్ఛబ్దః ప్రవర్తతే ॥
నిశ్శబ్దం తత్పరం బ్రహ్మ పరమాత్మా సమీయతే।
నాదోయావ న్మనస్తావ న్నాదాన్తే ఒపి మనోన్మని॥
స శబ్దశ్చాక్షరే క్షీణే నిశ్శబ్దం పరమం పదమ్।
సదానాదాను సంధానా త్సంక్షీణా వాసనా తుయా॥
నిరంజనే విలీయేతే మనోవాయుం నసంశయః।
నాదకోటి సహస్రాణి బిందుకోటి శతానిచ ॥

సర్వే తత్ర లయంయాతి బ్రహ్మ ప్రణవనాదకే ।
సర్వావస్థా వినిర్ముక్తః సర్వ చింతా వివర్జితః ॥
మృతవత్తిష్ఠతే యోగీ సముక్తోనాత్ర సంశయః ।
శంఖదుందుభి నాదంచ నశృణోతి కదాచన ॥
కాష్టవజ్జాయతే దేహ ఉన్మన్యావస్థయాధ్రువమ్।
నజానాతి సశీతోష్ణం నదుఃఖం నసుఖం తథా ॥
నమాన నావమానంచ సంత్యక్త్వాతు సమాధినా ।
అవస్థాత్రయ మన్వేతి న చిత్తం యోగిన స్సదా॥
జాగ్రన్నిద్రా వినిర్ముక్తః స్వరూపావస్థతామియాత్

తా॥ మనస్సు ప్రణవనాదముతోటి యెచ్చట లయమగునో, అదియే పరమమగు వైష్ణవ పదము. అనగా ప్రాప్యమగు బ్రహ్మ స్థానమనుట. "శబ్దగుణకం ఆకాశమ్" శబ్దమే గుణముగాగలది ఆకాశమని చెప్పుటచేత ఎంతవఱకు శబ్దము వినబడునో, అంతవరకు ఆకాశమనే, సంకల్పములు, భావనలు యుండును. అందువలననే "భావాతీతం బ్రహ్మ" యని చెప్పబడియె. "నిశ్శబ్దం బ్రహ్మ ఉచ్యతే" యనురీతిగా శబ్దము లయమును బొందిన తరువాత శబ్దాతీతమగు పరమగు బ్రహ్మమే సిద్ధించుచున్నది. అదియే పరమాత్మయని తెలిసికొనుచున్నారు. ఎంత

వరకు నాదమున్నదో అంతవఱకు మనస్సు ప్రవర్తించుచుండును. నాదము ముగిసిన తరువాత మనస్సు ఉన్మనీ భావమును (పరమాత్మలో లయమగుట) పొందును. తరువాత మనస్సులేదు. కనుక యాత్మజ్ఞానులకు మనస్సను పదార్థము వేరుగాలేదు. ఆత్మ ఒకటియే. ఆ ప్రణవశబ్దము అక్షర పరబ్రహ్మములో లీనమగుచున్నది. నిశ్శబ్దమే పరబ్రహ్మపదము. ఎల్లప్పుడు ప్రణవనాదాను సంధానము వలన సమస్తవాసనలు నశించును. నిరంజనమగు పరబ్రహ్మములో మనస్సు, వాయువు, రెండున్ను లయమగును. ఇందు సందేహమొందులేదు. అనేక నాదములును, ననేక బుద్ధిచలనములున్ను, బ్రహ్మప్రణవ నాదములో లయమొందుచున్నవి. అట్టి యోగి సమస్త చింతలను విడనాడి బ్రహ్మమునందే విహరించుచు సమస్త యవస్థలను (జాగ్రదాది యవస్థలను) అతిక్రమించినవాడై జీవించియుండియు మరణించినవానివలె (ప్రపంచముతోటి సంబంధములేనివాడై) సమస్తేంద్రియ[illegible]గిన వాడై యుండును. ఆ యో[illegible] ఈ విషయములో సంశయములేదు. శ[illegible]నాదమును యొకానొకపుడును వినడు. ఉన్మనీ యవస్థలో నున్న

వాని దేహము కొయ్యవలె అవును. అనగా అట్టివానికి దేహాభిమాన మొకించుకయు లేదనుట ఆ ధ్యాన నిష్ఠుడు సుఖదుఃఖములనుగాని, శీతోష్ణములనుగాని నెఱుంగడు. మానాభిమానముల వదలి సమాధి యోగముచే (బ్రహ్మ మునందు చిత్తమును జేయుటచే) మూడవస్థల నతిక్రమించు చున్నాడు. ఆ యోగికి యెప్పుడుగాని చిత్తమనునది లేదు. (సంకల్పరహితుడగుచున్నాడు) జాగ్రదాది అవస్థల నతిక్రమించినవాడై స్వస్వరూపస్థితిని పొందుచున్నాడు. ఇటుల. నాదబిందూపనిషత్తు నినాదము (ధ్వని) చేయు చున్నది.

అథ ధ్యాన బిందూపనిషత్

° 75. మం॥ ఓమిత్యేకాక్షరంబ్రహ్మ ధ్యేయంసర్వ
ముముక్షుభిః ॥

తా॥ సమస్త యుపనిషత్తుల సారమైనటువంటి ఓమ్ అను ఏకాక్షరమును, బ్రహ్మభావముతోటి ముముక్షువు లందఱు ధ్యానముచేయవలయును.

76. మం॥ ఓంకారప్రభవా దేవా ఓంకారప్రభవాస్స్వరాః।
ఓంకారప్రభవం సర్వం త్రైలోక్యంస చరాచరమ్ ॥

తా॥ ఓంకారమునుండియే బ్రహ్మాది సమస్త దేవతలు న్ను స్వరములతోకూడిన సమస్తవేదములున్ను, చరాచరాత్మకములగు యీ మూడు లోకములున్ను ఆఓంకారమునుండి పుట్టినవే.

77. మం॥ హ్రస్వోదహతిపాపాని దీర్ఘస్సం పత్ప్రదోఽవ్యయః ।
అర్ధమాత్రా సమాయుక్తః ప్రణవో మోక్షదాయకః॥

తా॥ ఈ ఓంకారము హ్రస్వముగా ఉచ్చరింపబడినదై సమస్తపాతకములను నశింపజేయును. దీర్ఘముగ యుచ్చరింపబడినదై అక్షయమగు సంపత్తు నొసగును. అనగా నశింపని విజ్ఞానముగలుగునని భావము. అర్ధమాత్రయగు నాలుగవ పాదమో, సమన్వయపఱచి దాని యర్థమును భావములో నుంచి, ధ్యానించెడు ప్రణవము మోక్షము నొసగును.

78 మ॥ తైలధారామి వాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్
అవాచ్యం ప్రణవస్యాగ్రం యస్తంవేద సవేదవిత్॥

తా॥ దీనివలన ధ్యానవృత్తిం గురించి తెలియందగును. ఎడతెగని తైల ధారవలెను. గొప్పదగు ఘంటకొట్టిన

తరువాత గలుగుచుండు దీర్ఘమైన ధ్వనివలెను, అవాచ్య
మైన నాలుగవ పాదమగు ప్రణవముయొక్క, అగ్రమును
నెవడు తెలిసికొనుచున్నాడో, (ధ్యానమునందు ధ్యేయా
కారమగుచున్నాడో) వాడు వేదములకు సారభూతమైన
ప్రణవమును, ప్రణవవాచ్యమగు పరబ్రహ్మను, యెఱింగిన
వాఁడు. "నివర్తన్తే క్రియాస్సర్వా స్తస్మిన్ దృష్టేపరా
వరే" ఇటుల పరమగు పరబ్రహ్మమును గాంచగా సమస్త
క్రియలు (సమస్తవృత్తులు) నశించును. తదేకరూపుఁడగు
చున్నాడని భావము. ఈ ప్రకారముగా ధ్యానబిందూప
నిషత్తు తెలియజేయుచున్నది.

## అథ అథర్వశిర ఉపనిషత్.

79\. మం॥ హృదిస్థా దేవతాస్సర్వా హృది ప్రాణా
ప్రతిష్ఠితాః।
హృదిత్వమసి యో నిత్యం తిస్రోమాత్రాః పరస్తుసః॥

తా॥ హృదయములోనే సమస్తదేవతలున్నారు. హృ
దయములోనే సకల ప్రాణములు స్థిరములై యున్నవి.
"ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశే ఽర్జునతిష్ఠతి"
యన్నట్లు ఓ యీశ్వరా నీవు హృదయములోనేయున్నా

ఏ నీవు త్రిమాత్ర స్వరూపమగు ప్రణవములోనే యుంటున్నావు. పరుడవు.

20. మం॥ తస్యోత్తరతశ్శిరో, దక్షిణతః పాదౌ,
య ఉత్తరతస్స ఓంకారః, య ఓంకారస్స ప్రణవః,
యః ప్రణవః స సర్వవ్యాపీ యస్సర్వవ్యాపీసో నంతః,
యో నంతస్తత్తారం, యత్తారం త త్సూక్ష్మం,
యత్సూక్ష్మం తచ్ఛుక్లం, యచ్ఛుక్లంత ద్వైద్యుతం
యద్వైద్యుతం తత్పరం బ్రహ్మ, యత్పరం బ్రహ్మ
సఏకః, యఏకః సరుద్రః, యోరుద్రః స ఈశానః
య ఈశానః సభగవాన్ మహేశ్వరః ॥

తా॥ ఆ యీశ్వరునియొక్క శిరస్సు ఉత్తరములోను, పాదములు దక్షిణములోనున్నవి. ఏది యుత్తరముగా నున్నదో, ఏది ఓంకారమో, అదియే ఓంకారము. ఏది ప్రణవమని చెప్పబడెనో, అదియే ప్రణవము, ఏది సర్వ వ్యాపియో అదియే సర్వవ్యాపి. ఏది అనంతమో అదియే అనంతము. ఏది తారమో, అదియే తారము. ఏది సూక్ష్మమో అదియే సూక్ష్మము. ఏది శుక్లమో అదియే శుక్లము. ఏది వైద్యుతమో అదియే వైద్యుతము. ఏది పరంబ్రహ్మమో అదియే పరంబ్రహ్మము. ఏది ఏకమో

అదియే ఏకము. ఎవడు రుద్రుడో అతడే రుద్రుడు. ఎవడు ఈశానుడో అతడే భగవంతుడు. ఇకమీాదట ఓంకారమునకు ఓంకారమనియు, ప్రణవమనియు, సర్వవ్యాపియనియు, ఇత్యాదినామధేయములు యే కారణమువలన కలిగినవో క్రమముగ నవి చెప్పబడుచున్నవి.

• 81. మం॥ అథ కస్మాదుచ్యతే ఓంకారః ।
తా॥ యెందువలన ఓంకారమని చెప్పబడియె ?

"యస్మాదుచ్చార్యమాణఏవప్రాణానూర్ధ్వముత్క్రామయతి తస్మాదుచ్యత్తే ఓంకారః ॥

తా॥ యేకారణమువలన యుచ్చరింపబడగానే, సమస్తప్రాణములను యూర్ధ్వమును బొందించుచున్నదో (తురీయపదవిని పొందించుచున్నదో) అందువలన ఓంకారమని చెప్పంబడియె.

82. మం॥ అథకస్మా దుచ్యతేప్రణవః ?
తా॥ ఎందువలన ప్రణవమని చెప్పబడుచున్నది ?

• "యస్మాదుచ్చార్యమాణ ఏవఋగ్యజుస్సామాథర్వాఙ్గిరసంబ్రహ్మ బ్రాహ్మణేభ్యః ప్రణామయతినామయతిచ తస్మాదుచ్యతే ప్రణవః ॥

తా॥ ఏ ప్రణవము యుచ్చరింపఁబడగానే బ్రాహ్మణుల కొఱకు, ఋగ్ యజుస్సామాథర్వవేదములను లోనగు నటుల చేయుచున్నదో, అనగా ఒక ప్రణవోచ్చారణము చేత సమస్తవేదముల పఠనఫలమును, బ్రాహ్మణః=బ్రహ్మజ్ఞాని పొందుచున్నాడు. "ప్రణూయతే ప్రస్తూయత ఇతి ప్రణవః" సమస్తాగమాది శాస్త్రములచేతను, యీప్రణవము స్తోత్రము చేయఁబడుచున్నది గనుక, ప్రణవమని దీనికి పేరువచ్చెను. మఱియు "ప్రణవతీతి ప్రణవః" యీ ప్రణవము భగవంతుని స్తోత్రము చేయుచున్నది కనుక ప్రణవమని పేరువచ్చెను. "జగత్కారణత్వేన ప్రణూయతే ప్రస్తూయత ఇతి ప్రణవః" సమస్తలోకములకు కారణమని స్తోత్రము చేయఁబడుచున్నది కనుకను ప్రణవనుయ్యెను.

83. మం॥ అథకస్మాదుచ్యతే సర్వ వ్యాపీ ? యస్మాదు
చ్చార్యమాణఏవ సర్వాఁల్లోకాన్ వ్యాప్నోతి।
స్నేహోయథా పలల పిండమివ శాంతరూపమోతం
ప్రోత మనుప్రాప్తో వ్యతిషక్తస్య తస్మాదుచ్యతే
సర్వవ్యాపీ ॥

తా॥ యెందువలన సర్వవ్యాపియని చెప్పబడుచున్నది? ఎందువలన యుచ్చరింపబడగానే సమస్తలోకములను మాంసఖండమును తైలమువలె (నూనె) ప్రణవము వ్యాపించియున్నది. ఓతప్రోతమును వస్త్రమునకు పడుగుపేక వలె (బాహ్యాభ్యంతరముల వ్యాపించుటను) శాస్త్రస్వరూపమును బొందినదై అంతట వ్యాపించియున్నది. అంతట సంబంధించి యున్నది. అందువలన సర్వవ్యాపియని పేర్కొనబడెను.

○ 84. మం॥ అథకస్మాదుచ్యతే ऽనంతః ?

తా॥ ఎందువలన అనంతమని చెప్పబడుచున్నది?

యస్మాదుచ్చార్య మాణఏవ తిర్యగూర్ధ్వమధ
స్తాచ్చాస్యాంతో నోప లభ్యతే తస్మాదుచ్యతే
ऽనంతః ॥

తా॥ ఎందువలన యుచ్చరింపబడగానే అడ్డముగా యూర్ధ్వముగా, క్రిందుగా వ్యాపించినదై దీనియొక్క లయము తెలియబడదో, అందువలన అనంతమని చెప్పబడుచున్నది.

○ 85. మం॥ అథకస్మాదుచ్యతే తారమ్ ?

తా॥ ఎందువలన తారమని చెప్పబడుచున్నది?

• యస్మా దుచ్చార్య మాణఏవ గర్భ, జన్మవ్యాధి, జరామరణ సంసార మహాభయాత్తార యతి త్రాయతేచ తస్మా దుచ్యతే తారమ్ ॥

తా॥ ఎందువలన యుచ్చరింపబడుచున్నదయ్యో, గర్భములో పుట్టుట, వ్యాధి జరామరణాత్మకమైన సంసారమనే మహాభయమునుండి తరింపజేయుచున్నదో (రక్షించుచున్నదో) అందువలన తారమని చెప్పబడుచున్నది. 'తారయ తీతి తారకః'' తరింపజేయునది కనుక యీప్రణవమునకు తారకమనియు పేరుగలిగెను.

86. మం॥ అథకస్మా దుచ్యతే శుక్లమ్ ?

తా॥ ఎందువలన శుక్లమని చెప్పబడుచున్నది ?

యస్మా దుచ్చార్య మాణ ఏవక్లస్థతే
క్లామ యతి చ తస్మా దుచ్యతె శుక్లమ్ ॥

తా॥ ప్రణవము ఉచ్చరింపబడగానే హృదయములోని మర్మలిన సంస్కారములను నాశముచేయును. అనగా హృదయమును శుద్ధముచేయుననుట. మఱియు జలమే లాగున స్వచ్ఛమైయుండునో ఆలాగునే ధ్యానించు వారియొక్క మనస్సుగూడ నిర్మలమగుటవలన శుక్లమని పేరు వచ్చినది.

87. మం॥ అథకస్మా దుచ్యతే సూక్ష్మమ్ ?
తా॥ ఎందువలన సూక్ష్మమని చెప్పబడుచున్నది?

యస్మా దుచ్చార్య మాణ ఏవ సూక్ష్మో
భూత్వా శరీరాణ్యాధి తిష్ఠతి
సర్వాని చాంగాన్యభి మృశతి
తస్మా దుచ్యతే సూక్ష్మమ్ ॥

తా॥ ఎందువలన యుచ్చరింపబడగానే సూక్ష్మస్వరూపమును బొల్చి, శరీరములను యధిష్ఠించుచున్నదో, సమస్తావయవములను స్పృశించుచున్నదో, అందువలన సూక్ష్మమని చెప్పబడుచున్నది.

88. మం॥ అథకస్మా దుచ్యతే వైద్యుతమ్ ?
తా॥ ఎందువలన వైద్యుతమని పేర్కొనబడుచున్నది.

యస్మా దుచ్చార్యమాణ ఏవ వ్యక్తే మహసి
తమసిద్యోతయతి తస్మా దుచ్యతె వైద్యుతమ్ ॥

తా॥ ఎందువలన నుచ్చరింపబడగానే గొప్ప చీకటి యందు మెరుపు తీగవలె అజ్ఞానాంధకారమందు ప్రకాశమును కలుగజేయుచున్నదో (అజ్ఞానమును పూర్తిగా పోగొట్టుచున్నదో) అందువలన వైద్యుతమని చెప్పబడు

89. మం॥ అథకస్మాదుచ్యతే పరంబ్రహ్మ ?

తా॥ ఎందువలన పరం బ్రహ్మమని జెప్పబడు చున్నది ?

యస్మాత్పరమ పరం పరాయణంచ
బృహత్ బృహత్యా బృంహ
యతి తస్మా దుచ్యతే పరం బ్రహ్మ ॥

తా॥ ఎందువలన పరబ్రహ్మము అపరబ్రహ్మము (సగుణ నిర్గుణబ్రహ్మలను) ప్రాప్యస్థానమునున్ను, బృహత్ బృహత్యా=గొప్పవాక్కు-చేత గర్జించుచున్నదో అనగా యుచ్చరింపబడగానే పొందించుచున్నదో, అందువలన పరం బ్రహ్మమని చెప్పబడుచున్నది.

90. మం॥ అథకస్మా దుచ్యతే ఏకః ?

తా॥ ఎందువలన ఏకమని చెప్పబడియె ?

యస్సర్వాన్ ప్రాణాన్ సంభక్ష్య సంభక్షణేనాజః
సంసృజతి విసృజతి తీర్థ మేకేవ్రజన్తి
తీర్థమేకే దక్షిణాః ప్రత్యంచ ఉదంచః
ప్రాంచో అభివ్రజంత్యేకే తేషాం సర్వేషా
మిహాసద్గతిః సాకం సఏకో భూతశ్చరతి
ప్రజానాం తస్మా దుచ్యత ఏకః ॥

తా॥ ఏ ప్రణవము సమస్తప్రాణములను భక్షణము చేసి, భక్షించుటచే అనగా లయపఱచుటచేత (ఉపసంహారముచేతను) అజమై (పుట్టుకలేనిదై) సమస్తలోకములను సృష్టించుచున్నది. లయముచేయుచున్నది. గనుక ఓంకారోపాసకులు సకల దిక్కులందున్న తీర్థములను బొందుచున్నారు. సమస్తతీర్థముల ప్రయోజనమును, ప్రణవయుపాసనచేతనే పొందుచున్నారు. వారికిచ్చుటనే యుత్తమమగు గతిగలుగు చున్నది. మఱియు సకల జీవరాసులలో నొక్కడైయ్యే సంచరించుచున్నాడు. అందువలన యేకమని చెప్పబడుచున్నది.

91. మం॥ అథకస్మాదుచ్యతేరుద్రః ?

తా॥ ఎందువలన రుద్రుడని చెప్పబడుచున్నాడు ?

యస్మాదృషిభిః నాన్యైర్భక్తైర్ద్రు
తమస్యరూప ముపలభ్యతే తస్మాదుచ్యతే రుద్రః॥

తా॥ ఎందువలన మహర్షులమాత్రముచేతనే, యితర భక్తులచేతకాదు, దీని యొక్క స్వరూపము శీఘ్రముగా పొందబడుచున్నదో అందువలన రుద్రుడని చెప్పబడుచున్నది.

మం॥ అథకస్మా దుచ్యతే ఏకో రుద్రః ?

తా॥ ఎందువలన రుద్రుడొకడనే చెప్పబడుచున్నాడు ?

ఏకఏవరుద్రః న ద్వితీయాయ తస్మై
య ఇమాంల్లోకా నీశత, ఈశనీ యుర్జననీయుః,
ప్రత్యఙ్జనాః తిష్ఠతి సంచుకో చాంతకాలే
సంసృజ్య విశ్వాభువనాని గోప్తా
తస్మా దుచ్యతే ఏకోరుద్రః ॥

తా॥ రుద్రుడొక్కడే రెండవవాడు లేడు. ఎవడీలోకముల నన్నిటిని సృష్టించి అంతరాత్మయై యున్నాడో, ప్రళయ కాలములో, లోకములను తనలో నిమిడ్చికొని, మరల సృజించి రక్షించుచున్నాడో, అందువలన రుద్రుడొక్కడనియే చెప్పబడుచున్నాడు. ఇచ్చట ఓంకారమును రుద్రుడని యెఱుఁగవలయును.

92. మం॥ అథకస్మాదుచ్యతే ఈశానః ?

తా॥ ఎందువలన ఈశానుడని చెప్పబడుచున్నది ?

యస్సర్వాన్ దేవానీశతే ఈశానీభిః
జననీభిశ్చ పరమశక్తిభిః అభిత్వాశూరనో

సమోదుగ్ధా ఇవ ధేనవః ఈశా నమస్య జగతః
స్వర్దృశమీశానమింద్ర తస్థుష
ఇతి తస్మాదుచ్యతే ఈశానః ॥

తా॥ సమస్త దేవతలను యెవడైతే ప్రజనశక్తి గల పరాశక్తులచేత సృష్టించుచున్నాడో, సమస్తలోకములకు ప్రభువుగానున్నాడో అందువలన ఈశానయని చెప్పబడియె.

93. మం॥ అథకస్మాదుచ్యతే భగవాన్ ?

తా॥ ఎందువలన భగవంతుడని చెప్పబడుచున్నాడు ?

యస్సర్వాన్ భావాన్ నిరీక్ష్యత్యాత్మ
జ్ఞానం నిరీక్షయతి యోగం గమయతి
సఏవ తస్మాదుచ్యతే భగవాన్ ॥

తా॥ ఎవడు సమస్త భావనలను సాక్షియై చూచుచున్నాడో, ఆత్మజ్ఞానము కలుగజేయుచున్నాడో, యోగమును పొందించుచున్నాడో, వాడే భగవంతుఁడు. ప్రణవ స్వరూపుఁడని భావము.

94. మం॥ అథ కస్మాదుచ్యతే మహేశ్వరః ?

తా॥ మహేశ్వరుడని యెందుకు చెప్పబడుచున్నది ?

యస్సర్వాన్ లోకాన్ సంభక్షు
స్సంభక్షయత్యజస్రసంసృజతి విసృజతి
వాసయతి తస్మాదుచ్యతే మహేశ్వరః ॥

తా॥ ఎవఁడు సమస్తలోకములను సంహారించి యెల్లప్పుడు లయపరచుచున్నాఁడో, సృష్టించుచున్నాఁడో, రక్షించుచున్నాఁడో, అందువలన మహేశ్వరుడని చెప్పఁబడుచున్నాఁడు.

95. మం॥ అథ కస్మాదుచ్యతే మహాదేవః ?

తా॥ ఎందువలన మహాదేవుడని చెప్పఁబడుచున్నాఁడు.

యస్సర్వాన్ భావాన్ పరిత్యజ్యాత్మ
జ్ఞానయోగైశ్వర్యే మహతి
మహీయతే తస్మాదుచ్యతే మహాదేవః ॥

తా॥ సమస్తభావములనువదలి యాత్మజ్ఞానము, యోగము, నైశ్వర్యము వీట్లతో కూడుకొన్నవాఁడై, మహీయతే=పూజింపఁబడుచున్నాఁడో అందువలన మహాదేవుడని చెప్పఁబడుచున్నాఁడు. మహాదేవుఁడు ప్రణవమయ్యేయున్నాఁడు.

మాత్రలయొక్క స్వరూపమును ఫలితమును జెప్పుచున్నారు.

96. యాసా ప్రథమమాత్రా బ్రహ్మదేవత్యా
రక్తావర్ణేన యస్తాం ధ్యాయతే నిత్యం
సగచ్ఛేద్బ్రహ్మపదమ్ ॥

తా॥ ప్రణవముయొక్క చతుర్ముఖ బ్రహ్మదేవతా స్వరూపమును, రక్తవర్ణమును దాల్చిన ప్రణవమాత్రను, యెవడు యుపాసించుచున్నాడో యాసాధకుడు బ్రహ్మ పదమును (బ్రహ్మలోకమును) బొందుచున్నాడు.

మం॥ యాసాద్వితీయా మాత్రా విష్ణుదేవత్యా
కృష్ణావర్ణేన య స్తాం ధ్యాయతే నిత్యమ్
సగచ్ఛేద్వైష్ణవం పదమ్॥

తా॥ ఉపాసకుడు విష్ణుదేవతా స్వరూపముగల కృష్ణ వర్ణమగు ద్వితీయ మాత్రను, నిర్విషయుడై చింతించునో వాడు వైష్ణవపదమును అనగా విష్ణులోకమును బొందును.

మం॥ యాసా తృతీయామాత్రా ఈశాన దేవత్యా
కపిలావర్ణేన యస్తాం ధ్యాయతే నిత్యం
సగచ్ఛే దైశానపదమ్ ॥

తా॥ ఈశానదేవతయు, కపిల వర్ణముగల తృతీయ మాత్రను యుపాసించువాడు. యైశాన పదమును (ఈశ్వర లోకమును) బొందుచున్నాడు.

మం॥ యాసాఽర్ధ చతుర్థీమాత్రా సర్వదేవత్యా
వ్యక్తీభూతా ఖంవిచరతి శుద్ధస్ఫటికి
సన్నిభావర్ణేన యస్తాం ధ్యాయతే నిత్యం
సగచ్ఛేత్పదమ నామయన్ ॥

తా॥ వర్ణములో స్ఫటిక సమానమైనదియు, శుద్ధమైనదియు సమస్తదేవాత్మ స్వరూపమైనదియు, అవ్యక్తమైనదియు, ఆకాశములో సంచరించునదియునగు అర్ధమగు చతుర్థమాత్రను యుపాసించువాఁడు శాశ్వతమగు, స్థానమును (పరబ్రహ్మమును) బొందుచున్నాఁడు.

మం॥ తదేత దుపాసీత మునయో వాగ్వదన్తి
నతస్య గ్రహణ మయంపంథా విహిత
ఉత్తరేణ యేనదేవాయాన్తి
యేన పితరో యేన ఋషయః
పరమ పరం పరాయణంచేతి ॥

తా॥ మహర్షులు యీ ప్రణవమునే యుపాసించవలయునని చెప్పుచున్నారు. ఆప్రణవముయొక్క యవగాహనము దుస్సాధ్యము. ఈ ప్రణవ మార్గమే యుత్తరాయణ మనిచెప్పఁడెను. ఏ మార్గముచేత దేవతలు, పితృదేవతలు, ఋషులు, పరమును, అపరమును, పరా

యణం=ప్రాప్యస్థానమును బొందుచున్నారు. ఇటుల అథర్వశిరోపనిషత్తు చాటుచున్నది.

అథనారద పరివ్రాజకోపనిషత్.

97. మం॥ అథ హైనం భగవన్తం పరమేష్ఠినం నారదః
పప్రచ్ఛ సంసారతారకం ప్రసన్నో బ్రూహీతి
తథేతి పరమేష్ఠీ వక్తుముప చక్రమే ఓమితి బ్రహ్మేతి
వ్యష్టిసమష్టి ప్రకారేణ కా వ్యష్టిః కా సమష్టిః
సంహార ప్రణవః సృష్టి ప్రణవశ్చాన్త ర్బహిశ్చోభ
యాత్మకత్వాత్త్రివిధో బ్రహ్మ ప్రణవః॥

తా॥ సర్వలోక పూజ్యుడగు బ్రహ్మదేవుని నారద మహర్షి ఓ భగవంతుడా! అను గ్రహమూర్తివై సంసారమును తరింపజేయునది యెద్దియో అద్దానిని నాకు అనుగ్రహించుమని అడిగెను. బ్రహ్మదేవు డట్లేయని చెప్పుటకు ప్రారంభించెను. ఓమితి బ్రహ్మేతి వ్యష్టి సమష్టి ప్రకారేణ ఓం అని బ్రహ్మ అని (ఓంకారగమనగా బ్రహ్మమేను) అది వ్యష్టిరూపముగను సమష్టిరూపముగను నున్నది. వ్యష్టియనగా ప్రణవముయొక్క అవయవముల (అ.ఉ.మ.) విభజించుట సమష్టియనగా, అఖండమగు ప్రణవమునే సముదాయ రీతిగాచెప్పుట. సమష్టిపూర్వక

ముగా ప్రణవ విభాగమును చెప్పుచున్నారు. బ్రహ్మమును ప్రతిపాదించునట్టి బ్రహ్మప్రణవము. మూడు తెఱంగులై విలసిల్లుచున్నది. (1) సంహారప్రణవము (2) సృష్టి ప్రణవము. అంతః (లోపల) బహిః, (బయట) ఉభయాత్మకత్వాత్. (రెండు రూపములగుటవలన) (3) బాహ్యాభ్యన్తర రూపమగు ప్రణవము అని మరియు బాహ్యాభ్యన్తర ప్రణవమే వివరింపబడుచున్నది.

అన్తః ప్రణవో వ్యావహారిక ప్రణవః బాహ్యప్రణవ
ఆర్ష ప్రణవః ఉభయాత్మకో విరాట్ ప్రణవః
సంహారప్రణవో, బ్రహ్మప్రణవ అర్ధమాత్రా ప్రణవః
ఓమితిబ్రహ్మ ఓమిత్యేకాక్షరమన్తః ప్రణవంవిద్ధి,
సచాష్టధాభిద్యతే.

తా॥ అన్తః ప్రణవమనగా బ్రహ్మమును బోధించుటకై వ్యవహారార్థము కల్పింపబడినది. బాహ్యప్రణవ మనగా, యజ్ఞయాగాదులయందు కల్పింపబడిన ప్రణవము ఉభయాత్మక ప్రణవమనగా, విరాట్‌ను బోధించునది. బ్రహ్మప్రణవ భేదమగు సంహారప్రణవము అర్ధమాత్ర గలది. కేవలపరబ్రహ్మమునే బోధించుచున్నది. ఓమితి బ్రహ్మ. ఓమ్ అనునది పరబ్రహ్మము. ఇటుల జెప్పి

నందుచే బ్రహ్మ (పరబ్రహ్మము) ఓమితి ఓంకారవాచ్య మని యే యెఱుంగవలయును. మఱియు సంసారమును తరించు వారలకు. ఓమ్ అనునది సాక్షాత్ పరబ్రహ్మప్రాప్తికి సాధనముగానున్నదని తెలియవలెను. అట్టి ప్రణవమేదన! ఓమితి. ఓమ్ అను ఒకే యక్షరము. అద్దానిని అన్తః ప్రణవం విద్ధి — అన్తరాత్మ ప్రతిపాదక ప్రణవముగా తెలిసికొనుమా! "సచాష్టధాభిద్యతే అకారోకార మకారార్ధమాత్రా నాదబిందుకళా శక్తిశ్చేతి" అది యెనిమిది విధములుగా భేదమును జెందుచున్నది. అదెటులన అకార, ఉకార, మకార, అర్ధమాత్ర నాద, బింధు, కళాశక్తి, అని

తత్రచత్వార అకారశ్చాయుతా వయవాన్విత
ఉకారః, సహస్రావ యవాన్వితో మకారః,
శతావయవోపేతో ఒర్ధమాత్రా ప్రణవో ఒనన్తావ
యవాకారః, సగుణో విరాట్ ప్రణవః, సంహారో
నిర్గుణప్రణవ ఉభయాత్మ కోత్పత్తి ప్రణవో
యథాప్లుతో విరాట్ ప్లుతః ప్లుత సంహారో
విరాట్ ప్రణవః షోడశమాత్రాత్మకః షట్త్రిం
శత్తత్త్వాతీతః షోడశ మాత్రాత్మ కత్వం కథమిత్యుచ్యతే.

త్రా॥ ఆభేదములలో నాలుగగు అకార ఉకార
కార అర్ధమాత్రలలో అకారము. అయుతావయా
తః పదివేల అవయవములతో కూడుకొన్నది. ఉకార
ము. వేయి అవయవములతో కూడుకొన్నది. మకారము.
హారవయవములతో కూడుకొన్నది. అర్ధమాత్రా ప్రణ
వము. "అనన్తావ యవాకారః" అన్తములేని అవయవ
ముల ఆకారముగలది. ఉభయాత్మక విరాట్ ప్రణవము
(విరాట్‌ను బోధించు) సగుణమని. సంహారభూతమగు
బ్రహ్మ ప్రణవము. నిర్గుణ బ్రహ్మప్రతిపాదకమని, ఉభ
యాత్మక ప్రణవము ఉత్పత్తి ప్రణవమని నెఱుంగవలయును.
మరియు ప్రణవము. ప్లుతభేదముచే మఱియొక విధముగా
చెప్పబడుచున్నది. విరాట్ ప్లుతము. ప్లుతసంహారము అని.
విరాట్ ప్రణవము షోడశమాత్రల స్వరూపముగలది.
ముప్పదియారు తత్త్వములను అతిక్రమించినది. పరమ
పురుషుడని చెప్పంబడియె — విరాట్ ప్రణవమునకు
పదహారు మాత్రలు. యెటులన; చెప్పబడుచున్నవి.
అకారః ప్రథమోకారో ద్వితీయా మకార
స్తృతీయార్ధ మాత్రా చతుర్థీనాదః పంచమీబిందుః
కలా సప్తమీ, కలాతీతాష్టమీ, శాన్తిర్నవమీ

శాన్త్యతీతా ! దశమీ, ఉన్మన్యేకాదశీ, మనోన్మనీ
ద్వాదశీ పురీ త్రయోదశీ, మధ్యమా, చతుర్దశీ,
పశ్యన్తీ, పంచదశీ, పరా, షోడశీ, పునశ్చతు
షష్టిమాత్రా, ప్రకృతి పురుషద్వై విధ్యమాసాద్య
అష్టావింశత్యుత్తర శతభేదమాత్రా స్వరూపం
ఆసాద్య సగుణ నిర్గుణత్వ ముపేత్యైకోపి,
బ్రహ్మప్రణవః సర్వాధారః పరంజ్యోతి ఏష
సర్వేశ్వరోవిభుః సర్వదేవమయః సర్వ ప్రపంచాధార
గర్భితః ॥

తా॥ ప్రథమమాత్ర అకారము ద్వితీయమాత్ర ఉకారము తృతీయమాత్ర మకారము. చతుర్థమాత్ర అర్ధమాత్ర. పంచమీమాత్ర నాదము. షష్ఠీమాత్ర బిందువు. సప్తమీ మాత్ర కల. అష్టమీ మాత్ర కలాతీతము. నవమీమాత్ర శాన్తి. దశమీమాత్ర శాన్త్యతీత. ఏకాదశీ మాత్ర ఉన్మనీ. ద్వాదశీమాత్ర మనోన్మని. త్రయోదశీమాత్ర పురి చతుర్దశీమాత్ర మధ్యమ. పంచదశీమాత్ర పశ్యన్తీ. షోడశీమాత్ర పరా ఈ విధముగ మఱల యీ ప్రణవము అఱువైనాలుగు మాత్రల స్వరూపము కలదై, ఒక్కొక్క మాత్రకు, ప్రకృతి, పురుషులయొక్క భేద

ముచే ద్వివిధత్వమునుబొంది, మొత్తము నూట యిరువ దెనిమిది భేదములతో గూడిన మాత్రా స్వరూపములతో బొంది సగుణ నిర్గుణ స్వరూపమును బొందు చున్నది, ఈ బ్రహ్మ ప్రణవము యద్వితీయము బ్రహ్మమును ప్రతి పాదించు యీప్రణవము, సమస్త జగత్తునకు యాధార ముగాను, పరంజ్యోతి స్వరూపముగాను, సకల ప్రపంచ ములకు నియామకుడుగాను, వ్యాపకముగాను, సర్వ దేవతా స్వరూపము అయ్యి సమస్త ప్రపంచమును తన లో యుపసంహరించుకొని యున్నది. అనగా సర్వ ప్రపం చము యీ ప్రణవమునుండియే యుత్పత్తి యగుచున్నది.

మం॥ సర్వాక్షరమయః కాలః సర్వాగమ మయశ్శివః,
సర్వశ్రుత్యుత్తమో మృగ్యః, సకలోపనిషన్మయః,
భూతంభవ్యం భవిష్య ద్యతి, కాలోదిత
మవ్యయమ్ తదప్యోంకార మేవాయం
విద్ధిమోక్ష ప్రదాయకమ్ తమేవాత్మాన
మిత్యేత ద్బ్రహ్మ శబ్దేన వర్ణితమ్
తదేక మమృత మజర మనుభూయతథోమితి॥

తా॥ ఏది సర్వాక్షర రూపమగు కాలమైయున్నదో, సర్వశాస్త్ర రూపమైయున్నదో, మంగళకరమై, సర్వ

వేదములకు మూలభూతమై, విచారించతగినదై, సకలోప నిషత్స్వరూపమైయున్నదో, భూతభవిష్య ద్వర్తమాన కాలములోనున్నదై, అవ్యయమైయున్నదో, అదియే ఓంకారమని యెఱుంగుము. అదియే మోక్షప్రదాయకము. ఆప్రణవముయొక్క స్వరూపమే బ్రహ్మశబ్దముచేత వర్ణింపబడినది. ప్రణవవాచ్యమగు పరబ్రహ్మమును బొంది, అమృతుఁడును, జరామరణ వర్జితుఁడనునై "బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః" యన్నట్లు యనుభవ జ్ఞానము కలవాడై బ్రహ్మములో సంచరించుచు "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మవిత్ బ్రహ్మమే యగుచున్నాడు. ఈవిధముగా నారద పరివ్రాజకోపనిషత్తు విజ్ఞాపనము చేయుచున్నది.

98. శ్లో॥ ఆద్యంచ అత్రి త్ర్యక్షరం బ్రహ్మత్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా ।
ఏకాక్షరం పరంబ్రహ్మ ప్రాణాయామః పరం తపః ।

శ్లో॥ ప్రణవాద్యాస్త్రియో వేదా ప్రణవేపర్య వస్థితాః ।
వాఙ్మయం ప్రణవం సర్వం తస్మాత్ప్రణవ మభ్యసేత్ ।

తా॥ అకార, ఉకార, మకారములతో కూడికొనిన మొదటనున్న బ్రహ్మము యాప్రణవమే యాప్రణవమందే సమస్త వేదములు ప్రతిష్ఠితములై యున్నవి. పరంబ్రహ్మ స్వరూపమైనది యేకాక్షరమే. అక్షరమగు ఓంకారమే; ఆప్రణవమును యాలంబనముగాచేసికొని, ప్రాణాయామము (ధ్యానమును) చేయడమే పరమతపస్సు. మూడు వేదములున్ను ఓంకారమే మొదటిగాగలవి. ప్రణవముచేతనే ఆ వేదములు సమాప్తినిచెందినవి. సకల వాక్కులున్ను ప్రణవ స్వరూపములే. ఈప్రణవము నొక దానిని జపించినచో సకల మంత్ర జపములును, సమస్త వేదాధ్యయనమున్ను చేసినవారే యగుదురు. కనుక "పద్మాసనం సమారుహ్య సమకాయ శిరోధరః నాసాగ్రదృష్టి రేకాన్తే జపేదోంకారమవ్యయమ్" సాధకుడు యేకాన్త ప్రదేశమున పద్మాసనస్థుడై, సమానముగా శరీరమును, శిరస్సును యుంచినవాడై, భ్రూమధ్యమున దృష్టి నునిచి, నాశరహితమైనటువంటి ప్రణవమును, బ్రహ్మభావముతో జపించవలయునని యోగ **చూడామణ్యుపనిషత్తు** ప్రతిపాదించిన రీతిగా ప్రణవోపాసన జేయవలయును.

## అథ రాజయోగ విచారః

99. తస్యమధ్యే మహావహ్నిః తత్పార్శ్వే చంద్ర
సూర్యయోః।
తజ్జాతుజాయతేనాదః ఓమిత్యేవంతుచాద్వయమ్

శ్లో॥ తేన మార్గేణ గత్వాతు చిదాకాశం నిరంజనమ్।
నిర్గుణంబ్రహ్మరంధ్రేచ సగుణం హృదిసంస్మరేత్ ॥
,, విరాట్‌రూపం భ్రువోర్మధ్యే ధ్యాయేద్యోగ
ప్రసిద్ధయే
మూలాధారే గ్రంధిభిత్వా పాదనాదం ప్రకాశతే ।
,, విష్ణుగ్రంధి తతోభిత్వా అర్ధనాదం ప్రకాశతే ।
రుద్రగ్రంధితతోభిత్వా త్రిపాదం శ్రూయతేసదా॥
,, బ్రహ్మరంధ్రే పూర్ణనాదం చిదాకాశే నిరన్తరమ్ ।
పూర్ణనాదేమనోరైక్యం రాజయోగాభిధాయనమ్ ॥
,, గురువాక్యేన లభ్యస్తే నాన్యథా గ్రంథకోటిభిః ।

తా॥ సుషుమ్నానాడియొక్క, మధ్య అగ్నిమండల
ము, ఆనాడి పార్శ్వభాగమున చంద్రమండల సూర్య
మండలములుగలవు. ఇవి గుర్తెటింగినచో యత్యద్భుత

మగు ప్రణవనాదము. స్పష్టముగా గోచరించును. సుషుమ్నా మార్గములోపోయి, బ్రహ్మరంధ్రమున చిదాకాశమనునట్టియు, నిరంజనమైన, నిర్గుణమైన, బ్రహ్మము హృదయములో; సగుణస్వరూపుని, భ్రూమధ్యము సర్వవ్యాపకుడగు విరాట్రూపుని, యోగులుయోగని కొఱకు, భావనచేయవలయును. ఈ ప్రకారముచేయ మూలాధారమున, ఆ గ్రంధిని ఛేదించి, ప్రణవనాద పాతిక భాగము వినపడును. తరువాత విష్ణుగ్రంధిని ఛేదిం యర్ధనాదము, రుద్రగ్రంధిని ఛేదించి అనాహ హృదం ములో ముప్పాతిక భాగము యిటులెల్లప్పుడు ప్రణ నాదము వినపడును. చిదాకాశ స్వరూపమగు బ్రహ రంధ్రములో, పరిపూర్ణనాదము, యెప్పుడు వినప చుండును. సర్వత్రో వ్యాపకమగు పూర్ణనాదమంది మనస్సును లయింపజేయడమే, రాజయోగమని చెప బడుచున్నది. గురువాక్యముచే నిది లభించునుగాని అనే గ్రంథములచే దొరుకునదిగాదు. ఇది గురుకీలకము

కేవలం కుంభకం యుక్తం ఏకనాదం సదాశివే।
దశనాదస్య మధ్యేతు ఘంటానాదం సదాశ్శృణు ॥

కేవలకుంభ కాభ్యాసముచే, ప్రణవనాదమును, హృదయ స్థానములో గుర్తెఱింగి దశనాదముల మధ్య ఘంటా నాదమునే యెల్లప్పుడు వినుము. ఆనాదమే ప్రణవధ్వని యని భావనజేయుము.

ఈవిధముగ రాజయోగ విచారమున చెప్పంబడియె.

## అనుభూతి ప్రకాశము.

100. శ్లో॥ తతస్తే నిర్గుణం బ్రహ్మ సంప్రచ్ఛుశ్శుద్ధ బుద్ధయః
అణో రణీయాన్యః ప్రత్యజ్ ప్రణవేతం తదాప్రభో

తా॥ సగుణబ్రహ్మను ధ్యానించి పరిశుద్ధాత్ములగు దేవతలు శుద్ధబుద్ధులై, నిర్గుణ బ్రహ్మమును దెలుపమని ప్రశ్నించిరట! అణువుకంటె యణువైన, యే ప్రత్యగాత్మ (అంతరాత్మ) ప్రణవమందుగలదో? దానిని నోప్రభువా చెప్పుమని ప్రజాపతిని యడిగిరట.

శ్లో॥ పరమాణోర్యోగి నేత్రగమ్యం రూపం యదస్తితత్।
ప్రతీచో నాస్త్యతః ప్రత్యజ్ఞణీయాన్పరమాణుతః॥

తా॥ యోగినేత్రములకు గోచరించిన పరమాణువు యొక్క రూపమేదియో, యారూపముగూడఁ ప్రత్య

గాత్మకులేదు. కనుక ప్రత్యగాత్మ పరమాణువు కంటెను సూక్ష్మమైనది.

శ్లో॥ ఓంకారో వాచక_స్తస్య ప్రతీకం వేతిహిశ్రుతం
ఓంకారేణాత్మనోధ్యానం వదాస్మభ్యం సవి_స్తరం

తా॥ ఆప్రత్యగాత్మకు ఓంకారము వాచకము. లేక ప్రతీకము (అవయవము) అని ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడియున్నది. కనుక ప్రణవముచే నాత్మను ధ్యానించుటను, వి_స్తరించి మాకుఁజెప్పుము.

శ్లో॥ శ్రూయతా మయమోంకారో నిశ్శేషజగదాత్మకః
ఇతిధ్యాత్వా బ్రహ్మసర్వ మాత్మా బ్రహ్మేతి
వైస్మరేత్॥

తా॥ ఓదేవతలారా! వినుడు ఓంకారము సమస్త జగత్స్వరూపమని "సర్వంఖల్విదం బ్రహ్మ" సమ_స్తము బ్రహ్మస్వరూపమని ధ్యానించిన సర్వము బ్రహ్మమగును. ఆత్మ (తాను) బ్రహ్మమనియే స్మరింపవలెను.

శ్లో॥ యదోంకారస్య సార్వాత్మ్యం ధ్యానాదైతన్న
వస్తుతః।

యద్బ్రహ్మణస్తు సార్వాత్మ్యం వస్తుతోఽవ్యైత
దీక్ష్యతామ్॥

బ్రహ్మస్యాత్సచ్చిదానంద రూపం సర్వేషువస్తుషు।
విద్యన్తే సచ్చిదానందాః ఇతిహ్యార్థ్యం ప్రవక్ష్యతే

దేహేంద్రియాది సాక్షీయ ఆత్మాఽస్మిన్బ్రహ్మ
రూపతామ్।

సచ్చిదానంద రూపత్వాద సంసారిణి యుజ్యతే॥

దేహాద్యుపాధి సంబంధా త్సంసారిత్వం చిదాత్మనః।
స్వతః శోఽయమ సంసారీ బ్రహ్మత్వం యుజ్యతేతతః॥

తా॥ ఓంకారమునకు జెప్పిన సర్వాత్మభావము ధ్యానమునకొఱకే, వాస్తవముకాదు. బ్రహ్మమునకుం గల సర్వాత్మ భావము వాస్తవము, దానినే వాస్తవముగా నీయోంకారభావమును జూడవలయును. బ్రహ్మము సచ్చిదానంద రూపము. సత్తు, చిత్తు, యానందము నన్నివస్తువులందును, గలవని ఇకమీాద జెప్పెదము. (సత్తు—ఉన్నది. చిత్తు—చైతన్యము. జ్ఞానము—ఆనందము—సుఖము. ప్రేమ (దేహేంద్రియములకు సాక్షియై యే ఆత్మకలదో, నది సచ్చిదానంద రూపము కనుక, సంసారికాని యా యాత్మ

యందు బ్రహ్మరూపము చెప్పదగియున్నది. దేహా ద్యుపాధిసంబంధమువలన (జీవాత్మకు సంబంధము కలిగి నది. స్వయముగా నది యసంసారి కనుక బ్రహ్మత్వము దానికిం దగును.

శ్లో॥ ఓమిత్యుచ్చారయన్ ధ్యాతా స్వాత్మానం
బ్రహ్మణా సహ ।
ఏకీకృత్య పునర్బ్రహ్మ స్వైకీ కుర్యాత్తథాత్మనః ॥

తా॥ ఓం అని యుచ్చరించుచు ధ్యానముచేయువాడు తన్ను బ్రహ్మముతో నేకీభవింపజేసి బ్రహ్మమునుగూడ సత్యాత్మ (తన)తో నేకీభవింపజేయవలయును.

101. శ్లో॥ చత్వారోఽప్యష్టమే ఖండే యోగాస్తుర్యస్య
భాసకాః ।
ఓంకారనామా ప్రణవేనాదో య స్తత్ర వర్ణితాః॥

శ్లో॥ ఓతాను జ్ఞాత్రను జ్ఞాత్రైరవి కల్ప ఇతీరితాః ॥
భేదైర్యోగావిభిన్నాః స్యురభయం బ్రహ్మతైర్భవేత్

శ్లో॥ ఓంకారమంత్రయోర్ధ్యేయం వస్తుయద్బహుధేరితః ।
తత్తత్త్వం నవమే ఖండే విస్పష్టం ప్రవివిచ్యతే ॥

తా॥ అష్టమఖండమందు నాలుగు యోగములు తు ర్యమును భాసింపఁజేయునవి కలవు. (సమాధినని యర్థము) ప్రణవమునం దేనాదముకలదో, యా యోంకారనామ యోగములచ్చట వర్ణింపబడినవి. ఓత, యనుజ్ఞాత, యనుజ్ఞ, యవికల్పము, యనుభేదములతో వేర్వేఱుగా యోగములు చెప్పఁబడినవి. వాటిచేత భయరహితమైన బ్రహ్మమగును. ఓంకారమందు, మంత్రరాజమునందును, ధ్యానింపదగినదిగా ననేకవిధముల వస్తువుచెప్పఁబడెను. దాని తత్త్వము తొమ్మిదవ ఖండమందు స్పష్టముగా వివరింపబడు చున్నది.

శ్లో॥ య ఆత్మాధ్యాత్మ దేహేషు యశ్చ ధ్యే యేషు
భాసతే ।
ఏకఏవ సచ్చిద్రూపో మాయయా భాత్యనేకవత్ ॥
సుషుప్తౌ జీవచైతన్య మద్వయం బ్రహ్మతాంవ్రజేత్ ।
జగత్సర్వ మవిద్యేతి సర్వై రప్యను భూయతే ॥
సృష్టేః ప్రాగప్యేవమాసీత్సా మాయావట బీజవత్ ॥
అనేక రూపతాం ప్రాప్య జీవే శావపి నిర్మమే ॥
కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః ।
ఉపాధ్యోశ్యా చిదాభాసా తే జీవేశావుదీరితౌ ॥

తా॥ ధ్యాతలయొక్క దేహములందు నే యాత్మ భాసించుచున్నదో, యే యాత్మ ధ్యానము చేయదగిన వస్తువులందు భాసించుచున్నదో, యది యొక్కటే చిద్రూపమై మాయచేత ననేకవిధములుగా భాసించుచున్నది. సుషుప్తియం దద్వితీయ చైతన్యము బ్రహ్మత్వమును బొందును. జగత్తంతయు నవిద్యయని యందఱు ననుభవించుచున్నారు. సృష్టికిముందుగూడ నిట్లేయుండెను. మఱ్ఱివిత్తువలె (సృష్టికిముందు) యీ మాయ యుండి పిమ్మట యనేకరూపములనొంది జీవేశ్వరులను నిర్మించెను. ఈ జీవుడు కార్యము లుపాధిగా గలవాడు. కారణము లుపాధిగాగల వాఁడీశ్వరుఁడు ఉపాధుల రెంటియందే చిదాభాసలుకలవో యవి జీవేశ్వరులనఁబడుచున్నవి.

102. శ్లో॥ నియంతే శోను మంతాతు జీవస్యాఽపిద్విధా భవేత్ ।

సమష్టి వ్యష్టిరిత్యాద్యైస్తయోః సర్వాభిమానవాన్
శ్లో॥ హిరణ్యగర్భః సూత్రాత్మా త్రిమూర్తిశ్చేదుదీర్యతే।
బ్రహ్మవిష్ణుశ్చ రుద్రశ్చ మూర్తయోగుణభేదతః ॥
లింగోపాధిత్వతో జీవాః అపీశా సర్వవిత్త్వతః ।
సమిష్టిస్సముదాయాత్మా వ్యష్టిస్తు పృథగాత్మవాన్ ॥

తా॥ నియామకుండీశ్వరుడు అనుమతించువాడు జీవుడు ఆ జీవుడును రెండు విధములు. సమష్టిజీవుడని, వ్యష్టి జీవుడని, వారిద్దఱిలో సర్వాభి మానముగలవాడు. హిరణ్యగర్భుఁడని, సూత్రాత్మయని, త్రిమూర్తియని చెప్పఁబడును. గుణభేదమువలన బ్రహ్మయని, విష్ణువని, రుద్రుడని, మూఁడు మూర్తులు. (ఆ హిరణ్యగర్భునకు) లింగోపాధివలన జీవులును, సర్వజ్ఞులగుటచేత నీశ్వరులును, సముదాయ రూపుడు సమిష్టియనబడును. వ్యష్టియను వాడు ప్రత్యేక ప్రత్యేకాత్మలు గలవారు (దేహములు గలవారు).

శ్లో॥ సమిష్టిః సూత్రవజ్జ్ఞేయో బ్రహ్మాండాఖ్యవపుర్విరాట్
దేవతిర్యఙ్మనుష్యాదిదేహో వ్యష్టిరితీష్యతే॥
,, పరః ప్రవిశ్య దేహేషు మాయయా గూఢవత్ స్థితః।
ద్వైతస్య మాయికత్వేన తత్త్వమద్వైత మిష్యతామ్

తా॥ సమష్ట్యాత్మ సూత్రమువంటిదని యెఱుంగవల యును. అతఁడు బ్రహ్మాండ మంతయుఁ దన శరీరముగాఁ గలవాఁడు. దేవతలు, తిర్యగ్జంతువులు, మనుష్యులు, మొదలైన వారి శరీరములు వ్యష్టియనంబడును. పర

మాత్మ దేహములందుఁ బ్రవేశించి మాయచేతఁ గప్ప బడినవాఁడువలె నుండెను. ద్వైతము మాయవలనఁగలిగి నందున తత్వము (అనగా పరమాత్మ) అద్వైతమని యంగీకరింపవలయును. ఇటుల అనుభూతి ప్రకాశగ్రంథ ము తెలియజేయుచున్నది.

## మనుస్మృతి.

103. శ్లో॥ బ్రహ్మణః ప్రణవంకుర్యా దాదావన్తేచసర్వదా
స్రవత్యనోంకృతం పూర్వం పరస్తాచ్చవిశీర్యతే॥

తా॥ వైదీకవిషయమును చదువుటకు ప్రారంభించు నపుడు, మొదటను కొనను, యెల్లప్పుడున్ను ఓంకారము నుచ్చరించవలయును. అట్లు ప్రారంభించునపుడు ఓంకార ముచేయని యెడల చదివినది యెల్ల గొంచము కొంచ ముగా మరచిపోవును. ముగింపున ఓంకారము చెప్పని యెడల చదివినది మనస్సున నిలువజాలదు.

## ప్రణవశాస్త్రము.

104. శ్లో॥ ఓంకారశ్చమహా వాక్య గాయత్రీభ్యాం స మన్వితః।
శాస్త్రసంసార కార్యాణి సర్వాణ్యేవాధి కారిణః॥

తా॥ మహావాక్యములతోను, గాయత్రీమంత్రముల తోను గూడిన ఓంకారమధికారికి సంసార కార్యము లన్నింటిని శాసించుచున్నది.

శ్లో॥ గాయత్రీవేదమాతా స్యాన్మహా వాక్యంపితాభవేత్
ఓంకారస్సర్వమూల స్యాత్స ఏవచ పితామహః॥

తా॥ గాయత్రి వేదములకుఁ దల్లి, మహావాక్యము దండ్రి, ఓంకారమన్నింటికిని మూలము, అదియే పితా మహుడు.

శ్లో॥ ఓమిత్యే తత్త్రయం జ్ఞాత్వాగాయత్రీం వేద
మాతరమ్ ।
మహావాక్యంచ విజ్ఞాయ వేదాభ్యాస ఫలంలభేత్ ॥

తా॥ ఓంకారమును, వేదమాతను గాయత్రిని, వేద మునందు చెప్పబడిన మహావాక్యమును తెలిసికొన్న వాడు వేదముల నభ్యసించిన వాని ఫలమును బొందును.

శ్లో॥ గాయత్రీ వేదమాతాచ వేదస్యప్రణవః పితా ।
ం ప్రతిమంత్రం ప్రయోక్తవ్య మో మిత్యేతత్పరావరమ్

తా॥ వేదముల తల్లి గాయత్రి, ఓంకారము వేదము లకు తండ్రి, అన్నింటికంటెను శ్రేష్ఠమయిన ఓంకార మును ప్రతియొక్క మంత్రముతోను ప్రయోగించునది.

శ్లో॥ స్మరణాత్కీర్తనా ద్వాపి శ్రవణాచ్చ జపాదపి ।
బ్రహ్మాతత్ ప్రాప్యతే నిత్య మోమిత్యేతత్ప
రాయణమ్ ॥

తా॥ ఓంకారమును స్మరించుచుండుట వలనను, కీర్తించుచుండుటవలనను, వినుచుండుటవలనను, జపము చేయు చుండుటవలనను, ఓంకారమే గొప్పస్థానముగా గల ఆ పరబ్రహ్మము లభించుచున్నది.

శ్లో॥ ఓమిత్యేకాక్షర ధ్యానాద్విష్ణుర్విష్ణుత్వ మాప్తవాన్
బ్రహ్మా బ్రహ్మత్వ మాప్నశ్శివతా మభజ చ్ఛివః ॥

తా॥ ఏకాక్షరమగు ఈ ప్రణవముయొక్క ధ్యానము వలననే విష్ణువు విష్ణుత్వమును, బ్రహ్మ బ్రహ్మత్వమును, శివుడు శివత్వమును బొందెను. ఈవిధముగ ప్రణవ శాస్త్రము ప్రణవమును గూర్చి స్తుతించెను.

వేమన.

105. ఆ ప్రణవ మంత్రమహిమ భావింప లింగంబే
మూడుమూర్తులందు మొనసియుండు,
మాన్యులెఱిగికొలువ మనుజులశక్యమా !
విశ్వదాభిరామ వినురవేమ !

ం ప్రణవమెఱుగనతడు భక్తుండు తాగాడు
జ్యోతిజూడ నతడు జోగిగాడు
నిత్యమెఱుగనతడు నిర్వాణికాడయా !
విశ్వదాభిరామ వినుర వేమ !

తా॥ ప్రణవరహస్యమును నెఱింగినవాడే భక్తుడన బడుచున్నాడు. జ్యోతి స్వరూపమును గాంచినవాడే యోగీశ్వరుడు. నిత్యమగు పరబ్రహ్మ స్వరూపమును గుర్తెఱింగినవాడే నిర్వాణియని చెప్పబడుచున్నాడు.

శ్రీమదాంధ్ర భాగవతము. (సప్తమస్కంధము).

**106.** మ॥ కలఁడంబోధి గలండు గాలిఁగలఁడా కా
శంబునం గుంభినిం
కలఁడగ్నిన్ దిశలంబగళ్ళ నిశలం ఖద్యోత
చంద్రాత్మలం
కలఁడోంకారమునం దిమూర్తులఁద్రిలింగ
వ్యక్తులందంతట
గలడీశుండుగలండు తండ్రి వెదకంగా నేల
నీ యా యెడన్. 274.

తా॥ ప్రహ్లాదుని తండ్రియగు హిరణ్యకశిపుఁడు భగవంతు డెచ్చట యున్నాడని యడుగగా! హృదయంబున హరిందలంచి, నమస్కరించి, బాలవర్తనంబున నర్తంబు సేయుచు నిట్లనియె. ఆ భగవంతుఁడు, సముద్రములో, గాలిలో, నాకాశములో, భూమిలో, నగ్నిలో, దిక్కులలో, రాత్రింబవళ్ళు, సూర్య చంద్ర స్వరూపములో గలడు. ఓంకారమునందును, బ్రహ్మ విష్ణు మహేశ్వరులందును, స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగ వ్యక్తులలో నా సర్వేశ్వరుఁడున్నాడు. సర్వాంతర్యామియై, నన్నిచోట్లను గలడు. తండ్రీ! ఇచ్చోట నచ్చోటనని వెదుకనేల. ఇట్లు చెప్పినందుచే సర్వేశ్వరుఁడు ప్రణవ స్వరూపుడై సందులేక నిండియున్నాడని తెలియంగ వలయును.

౦ సీ॥ రథము మేనెల్ల సారథి బుద్ధియింద్రియ
గణము గుఱ్ఱములు పగ్గములు మనము
ప్రాణాది దశవిధ పవనంబు లిరుసు
ధర్మాధర్మగతులు రథాంగకములు,
బహుళతరంబైన బంధంబు చిత్తంబు
శబ్దాదికములు సంచార భూము,

లభిమాన సంయుతుండయిన జీవుఁడు రథి
ఘనతరప్రణవంబు కార్ముకంబు

తే॥ శుద్ధజీవుండు బాణంబు శుభదమైన
బ్రహ్మ మంచింత లక్ష్యంబు పరులురాగ
భయమదద్వేష శోకలోభ ప్రమోహ
మానమత్సర ముఖములు మానవేంద్ర ॥

తా॥ శరీరమే రథము, బుద్ధిసారథి, ఇంద్రియములు గుఱ్ఱములు, మనస్సు పగ్గములు ప్రాణము, మొదలుగా గల పది వాయువు లిరుసు, ధర్మాధర్మములు చక్రములు వాటిని బిగియకట్టుటే చిత్తము. శబ్దస్పర్శరూపాదులు సంచరించు ప్రదేశములు. అభిమానముతో గూడుకొన్న జీవుఁడు రథికుడు. గొప్పదగు ప్రణవమే ధనస్సు. శుద్ధ జీవుఁడే బాణము. శ్రేయస్సు నొసగెడు బ్రహ్మమే చలిం చని లక్ష్యము. ఈ ప్రకారముగా దలంచి యంతరంగ శత్రువులగు రాగద్వేషాదుల ఓరాజేంద్రా! జయింపవల యును. ఇటుల అజగర మహర్షి ప్రహ్లాదునికి చెప్పెను.

వ॥ ఇట్లు మనుష్య శరీరరూపంబయిన రథంబు దన వశంబుచేసికొని మహాభాగవత చరణకమల సేవానిశితం

బయిన విజ్ఞాన ఖడ్గంబు ధరియించి, శ్రీ మన్నారాయణ కరుణా వలోకన బలంబున రాగాది శత్రు నిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మమనియెడి గుఱియందుఁ బడవేసి యహంకార రథికుఁడు రథికత్వంబుమాని నిజానందంబున నుండవలయు.

## శ్రీ భగవద్గీత.

107 శ్లో॥ రసోహమప్సుకౌన్తేయ ప్రభాస్మిశశి సూర్యయోః
ప్రణవస్సర్వ వేదేషు శబ్దఃఖేపౌరుషం నృషు ॥

తా॥ ఏ యే ధర్మములతో గూడుకొనిన, పరమాత్మనీ సమస్త జగత్తు యెటుల గ్రుచ్చబడియున్నదో చెప్పబడుచున్నది. ఓ అర్జునా! జలములలో సారభూతమగు రసమెద్దో, ఆరస స్వరూపుడగు నాయందు, జలములు గ్రుచ్చబడియున్నవి. చంద్ర సూర్యులకాంతి స్వరూపుడైన, నా యందు, చంద్ర సూర్యులు అను సూత్రులై యున్నారు. వేదములకు సారభూతమైనది ప్రణవము. అట్టి ప్రణవస్వరూపుడగు నాయందు సమస్త వేదములున్నవి. ఆకాశమందు శ్రేష్ఠమైన శబ్దమునేనే. ఆ శబ్ద స్వరూపుడగు నాయందు నాకాశము చేర్చబడియున్నది.

అటులనే మానవులందు శ్రేష్ఠమైనది పురుషభావము. అనగా పురుషత్వ బుద్ధి నేనే. అట్టి స్వరూపుడగు నాయందు పురుషులుంటున్నారు. ఇట్లు చెప్పినందుచే దారములో మణులవలె భగవంతునియందు సమస్తభూతములు గ్రుచ్చబడియున్నవి. అనగా భగవంతుడు సర్వాంతర్యామియని యర్థము.

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరా మస్మ్యేకమక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః

తా॥ మహర్షులలో భృగువు, వాక్కులలో అక్షరమగు ప్రణవమే. యజ్ఞములలో జపయజ్ఞము. పర్వతములలో హిమాలయము నేనై యున్నాను.

శ్లో॥ యదక్షరం వేదవిదోవదన్తి విశన్తియద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తితత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥

తా॥ ఏపరబ్రహ్మమును వేదార్థజ్ఞులు అవినాశియని చెప్పుచున్నారో ఇందులకు ప్రమాణము "తద్వా ఏతదక్షరంగార్గి బ్రాహ్మణాఽభి వదన్తి" బృహదారణ్య

కోపనిషత్. ఆ బ్రహ్మమును సర్వవిశేషరహితమనియు ఇందులకు ప్రమాణము "అస్థూలమనణు" బృహదారణ్యకోపనిషత్తు ఇత్యాదులు, మఱియు ప్రయత్నశీలురగు సన్న్యాసులు యాసక్తులైనవారలై, ఏ పరబ్రహ్మమును బ్రవేశించుచున్నారో ఏ అక్షరమును తెలిసికొనగోరినవారై గురుసన్నిధానములో బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్నారో, అట్టి యవ్యయమైన గంతవ్యస్థానమగు పరబ్రహ్మమును సంగ్రహముగ చెప్పుచున్నాను.

"సయోహవై తద్భగవన్మనుష్యేషు ప్రాయణాన్తమోంకార మభిధ్యాయీత కతమంవా వసతేనలోకం జయతీతి తస్మై సహోవాచ ఏతద్వై సత్యకామ పరంచాపరంచ బ్రహ్మయదోంకారః ఇతి ఉపక్రమ్య యః పునరేతం త్రిమాత్రేణోమిత్యే తేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత" ప్రశ్నోపనిషత్.

ఇవి మొదలుగాగల వాక్యములచేత

"అన్యత్రధర్మాదన్యత్రా ధర్మాత్" యిట్లని ప్రారంభించి

"సర్వేవేదాయత్పదమా మనన్తితపాంసి సర్వాణిచ యద్వన్తి యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తితత్తే పదం

సంగ్రహేణ బ్రవీమ్యోత్యేతత్" కఠోపనిషత్తు యివి మొదలుగాగల వచనములచేత పరబ్రహ్మమునకు వాచకరూపమై విష్ణ్వాదులకు విగ్రహమువలె ప్రతీకమై (చిహ్నమై) పరబ్రహ్మప్రాప్తికి అవ్యవహిత సాధనమగుటచేత, మంద మధ్యమాధికారులకు యీ ప్రణవోపాసన కాలాన్తరములోనైన (జన్మాన్తరములోనైన) ముక్తి ప్రదమై యున్నది.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగ
ధారణామ్ ॥

తా॥ సమస్తేంద్రియ గోళకములను, నియమించి అనగా ఇంద్రియముల తత్తద్విషయములలోను, విషయములకు కారణమగు వాటిలోను, ప్రవర్తించనటుల సంయమనము జేసి మనస్సును హృదయ పుండరీకములో పరమాత్మభావనచే నిరోధించి (వృత్తిరహితముగా జేసి అట్టి స్వాధీనపడిన మనస్సుచేత తన ప్రాణమును హృదయము నుండి యూర్ధ్వగామియైన, నాడీ ద్వారా యూర్ధ్వమును బొందించి బ్రహ్మరంధ్రములో నునిచి, ఇటుల యోగధారణ

చేయవలయును. అనగా "వృత్తిహీనంమనః కృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని, ఏకీ కృత్య విముచ్యేత యోగోఽయం ముఖ్య ఉచ్యతే"—మనస్సును వృత్తి రహితముచేసి యాత్మను బరమాత్మలో నైక్యపరచుట యోగమన బడును. యన్నట్లు యిట్టియోగమందు సుస్థిరుఁడు కావలయును. ఇట్టి యోగీశ్వరుఁడు యెటువంటి యుత్తమ గతిని పొందుచున్నాడను నది క్రింద ప్రతిపాదింపబడు చున్నది.

108. శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్మా
మనుస్మరన్ ।
యః ప్రయాతిత్యజన్ దేహంసయాతి
పరమాంగతిమ్ ॥

తా॥ పరబ్రహ్మమునకు నామధేయమైన ఓంకారము నుచ్చరించుచు, తదర్థరూపమైన నన్ను చింతించుచు యెవఁడు దేహమును వదలుచున్నాడో అట్టి యోగీశ్వరుఁడు యుత్కృష్టగతిని బొందుచున్నాఁడు.

ఓం తత్ సత్.,

శాంతిః, శాంతిః, శాంతిః.

# శ్రీసద్గురు మలయాళస్వాములవారి
## గ్రంధములు.

| | | రూ. అ. పై. |
|---|---|---|
| 1. | అనుభూతి ప్రకాశిక | 6—0—0 |
| 2. | ఈశ్వరకృప | 6—0—0 |
| 3. | లోకోద్ధారకము | 4—0—0 |
| 4. | అమృతబిందూపనిషత్తు | 0—1—0 |
| 5. | శ్రీమద్భాగవత సారము | 0—0—9 |
| 6. | శ్రీ శుద్ధవేదాంత తమోభాస్కరము | 2—8—0 |
| 7. | ధర్మసేతువు | 2—0—0 |
| 8. | స్వబోధసుధాకరము | 1—8—0 |
| 9. | శ్రీ వేంకటేశ్వర పూజాపంచరత్నమాలా | 0-12—0 |
| 10. | ఓంకారము (ప్రణవోపాసన) | 1—4—0 |
| 11. | ఓంకారపత్రయాగము | 2—0—0 |
| 12. | శ్రీ భగవద్గీత. 1. మూలము. 2. పదవిభాగము. 3. ప్రతిపదార్థము. 4. తాత్పర్యము. 5 విశేషార్థము. | 6—0—0 |
| 13. | శ్రీ భగవద్గీత మూలముమాత్రము | 0—8—0 |
| 14. | శ్రీ భగవద్గీత మూలము. 2. తాత్పర్యముగలది | 2—0—0 |
| 15. | శ్రీ బాలగోపాని | 4—8—0 |
| 16. | గుణత్రయము, గుణత్రయాతీతము | 0-12—0 |